# అతి త్వరలో!







ఈస్టిండియా వారి

# పక్కయింటి అమ్మాయి




అంజలి · రేలంగి ·

డైరెక్టర్ · సి. పుల్లయ్య




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

వ్యవస్థాపకులు

డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౨] డిశంబరు 1953 [సంచిక ౧౨



# విషయసూచిక



ద్వైతా ద్వైత ప్రేమ తత్వం




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ఉత్తమ సాహిత్యం

సంస్కారమును కలిగించడం ఉత్తమసాహిత్యం యొక్క ముఖ్యధర్మం. అట్టి సంస్కారమునుద్దేశించు సాహిత్యం నియమ బద్ధంగా, ప్రజాహితాన్ని, పురోభి వృద్ధిని కోరుతూ వర్ధిల్లాలి. అందుకనే యీ మధ్య శ్రీ గిడుగు సీతాపతిగారు ఉపన్యసిస్తూ ప్రజలకు తగినట్టి భాషలో గ్రంథాలు అందజేయబడాలనియు, అయితే వ్యావహారిక భాషసయితము ఎవరికి వచ్చినట్లు వారు వ్రాయడం కూడదన్నారు.

ప్రజలలో విద్య, విజ్ఞానములు స్వల్పముగానున్న రోజులలో న్యాయాన్ని, ధర్మాన్ని ప్రబోధించడానికని వెలసిన సాహిత్యం అనాదినుండి మతముతో సంబంధముకలిగి యుండేది. కాబట్టే మన అమూల్యమైన సారస్వతముగా నొప్పారు చిన్న భారతం, రామాయణం మొదలుగాగల గ్రంథాలు మతప్రాధాన్యాన్ని, ప్రాబల్యాన్ని రుజువుచేస్తుంటవి. వేదధర్మాలను సంపూర్ణంగా నిముడ్చుకొనిన సంస్కృతం భారతము తెలుగులో ఆదికావ్యంగా రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయ రచించాడు. తర్వాత అనేకమంది ప్రభువులు ప్రోత్సహించి శ్రీనాధుడు, అల్లసాని పెద్దన లాంటి కవీశ్వరులచే అనేక ఉత్తమ కావ్యాలు రచింపజేశారు. ఇదే విధంగానే బౌద్ధ,

జైన మతాలను పోషించిన ప్రభువులు ఆయా కాలాలలో న్యాయము, ధర్మము, నీతి, నియమముల వ్యాప్తికని ఆయా మతములకు సంబంధించిన సాహిత్యము, చిత్రకళ, శిల్పము, సంగీతము లుద్ధరించబడి ప్రచారములోకి తేబడినవి. కాని యీనాడు పరిస్థితులు మారినవి. ఏ ఒక్క మతాన్ని అనుసరించికాని సాహిత్యం, లలితకళలు, పురోభివృద్ధి గాంచడంలేదు. వివిధ మతాల సమన్వయప్రభావంతో ప్రజల అభ్యుదయాన్ని ఉద్దేశించి సాహిత్యం, లలితకళలు పురోగమిస్తున్నవి. ఏపాలకవర్గమైనా ఏ ఒక్క మతాన్నో సాత్త్వికదృష్టితో ప్రోత్సహిస్తూ యితరమతాలను, వాటివ్యక్తిగత ప్రభావాన్ని విస్మరించగల స్థితిలోలేదు, కాబట్టి సర్వమత సమన్వయ ప్రభావంతో వర్ధిల్లే సాహిత్యమును, లలిత కళలను ఆయాప్రభుత్వాలు పోషించి, ఆదరించడం ప్రతియొక్క ప్రభుత్వపు ధర్మమూను.

సంస్కారయోగ్యమైన సారస్వతం ప్రజలకు దైనందినంగా సామీప్యంకావాలి. అంటే పద్ధతిగల వ్యావహారిక భాష అందుకు మొదట అమలులోనికి రావాలి. దానికి దారి, డొంక, నియమములతోటి ప్రజలలో విజ్ఞానవికాసములతో బాటు సాహిత్యపిపాస, భాషాసంపద పెంపొందేదిగా నుండాలి. తర్వాత అనేక 'శాస్త్రా'లకు సంబంధించిన విషయాలు చిన్నచిన్న సంపుటాలుగా సులభగ్రాహ్యములగునట్లు అచ్చొత్తి ప్రజలకందుబాటైన ధరలలో విక్రయం జరుగాలి. ఇట్టి ప్రయత్నంమూలంగా సంస్కృత భాషలోనున్న అమూల్యమైన సాహిత్యం ప్రజాసామాన్యానికి అత్యంత సన్నిహితమగుతుంది. మనదేశాన్ని గురించి, సారస్వతాన్నిగురించి, సంస్కృతినిగురించి పూర్వాపరాలను సామాన్యప్రజానీకం తెలిసికోవాలన్నా, వానిని తెలిసికొని తమ సాంఘిక, వైజ్ఞానిక, ఆర్థిక, రాజకీయరంగాలలో తమ సమస్యలను తీర్చి దిద్దుకోవలెనన్నా యింతకంటె ఉత్తమమైన మార్గము మరేముంటుంది ?

సంగీతం, చిత్రకళ, నృత్యంలాంటి కళలు సయితం యీ ఉత్తమ సాహిత్యపు అభ్యుదయ నడకవలన ప్రజలలో ఆసక్తిని, పిపాసను, ఆరాధనను ప్రేరేపిస్తవి.

వివిధ శాస్త్ర పరిజ్ఞానాన్ని విస్తృతం చెయ్యడానికి సయితం ఉత్తమ సాహిత్యం సర్వతోముఖంగా దోహదం చేస్తుంది. కాబట్టి ప్రజలు, పాలకులు కూడా ఉత్తమ సాహిత్య వ్యాప్తికి కృషిచేసి సంస్కారమును త్వరిత పరచడం మహోత్తమం.



# ఆంధ్ర జానపదగేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

### వ్యంగ్య రచన

పూర్వపు జంగం కథలు సాధారణంగా ఏ రాజును గురించో ఉంటాయి. సామాన్య జనులను కథావీరులను చేయవచ్చు అను పరిజ్ఞానం ఆటుతర్వాత కాని కలుగలేదు. వెనకటి కథల పద్ధతికి చిన్నమ్మ కథ భిన్నంగా వుంది. కాని ఆమె మహా భక్తురాలు కాబట్టి కాబోలు కథావీరులు పరిపాలకులుగా ఉండాలి అనే నియమం సడలింది.

నిజమైన ఒకరాజు జీవితాన్ని కథగా అల్లడంలో చాలా చిక్కులున్నాయి. అతను ఇంకో ప్రాంత పురాజైతే, అనగా కవి ఉన్న ప్రదేశానికి గాక మరొక ప్రదేశానికి రాజయితే కవికి ఏమీ ఫర్వా లేదు. ఆ రాజువల్ల ప్రమాదంలేదు. ఇట్లు వ్రాయబడ్డవే కుమార రాముని కథ, బంగారు తిమ్మరాజు కథాను. ఏ రాజైనా పొగడితే ఒప్పుకుంటాడు కాని తిడితే ఒప్పుకోడు. కాబట్టి కవి ఉన్న ప్రదేశంలోని రాజును గురించి వ్రాయవలసి వచ్చినపుడు కవి వ్యంగ్యతను ఆశ్రయించవలసి వచ్చింది. అతని పేరు, ఊరు కథలో సూటిగా చెప్పడానికిలేదు. అట్లే ఇతర పాత్రల యదార్థ నామాలు కూడా మరుగు పరచవలసి వస్తూంది. ఈలాగు కథలో అన్నీ మారిపోయాయి. అసలు జంగం కథలలో ఉండే సంప్రదాయాలే బోలెడన్ని. వాటి మధ్యపడి కథ నలిగిపోతూంది. వాటికితోడు వ్యంగ్యత ఒకటి! కవి ఆత్మరక్షణకోసం అది తప్పదు. ఈ మోస్తరుగా రచించబడ్డ కథలే గాంధారి కథ, బాల నాగమ్మ కథ ఇత్యాదులు. వీటిలోని యథార్థ కథను గ్రహించడం క్లిష్టంగా ఉంది.

### కథావస్తువులోని పరిణామం

కథలు మహారాజులను గురించే కాని సామాన్యులను గురించి వుండకూడదు అనే అభిప్రాయం పూర్వ కాలంలో ఉండేదని చెప్పవచ్చు. అట్టి అభిప్రాయం వల్లే కథలోని ప్రధాన పాత్రలు మహారాజులు, రాణులున్ను దీనికి మినహాయింపులు - చిన్నమ్మ కథ వంటివి - వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు.

దేశం క్రమంగా స్వదేశరాజుల చేతులలోంచి మహమ్మదీయుల, తర్వాత యూరోపియల్ల చేతులలోకి పోయింది. కథకు స్వదేశరాజులు దొరకలేదు. మనలను అణగద్రొక్కే పరిపాలకులను పొగడుతూ కథలు బయలుదేరడం అసందర్భం. ఇట్టి సందర్భంలో మన దేశంలోని సామాన్య పరిపాలకులు, జమీందారులు తమ ఘనకార్యాలనుబట్టి మహా వీరులయేరు - సర్వాయిపాపడి కథా, దేశింగురాజుకథా, పెద్దబొబ్బిలిరాజు కథా ఇట్టివే. ఆ తర్వాత ఆ సూత్రం ఇంకా సడలింది. సామాన్యులైనా సరే అద్భుత కార్యాలు చేసినట్లయితే కథావీరులు కావచ్చు అనే భావం ఎర్పడింది. ఈ అద్భుత కార్యాలు అనేక రకాలు. ప్రభుత్వంమీద తిరగబడ్డవారు, విప్లవం లేవదీసినవారు ఒకరకం - ఈ రకానికి చెందిన కథ చిన్నపరెడ్డి కథ. పూర్వకాలంలో సహగమనం ఏ మహారాజు కుటుంబాలలోనో ఉండేది. అది పద్ధెనిమిదో శతాబ్దం ప్రాంతంలో ప్రజలలో బయలుదేరింది. కొందరు స్త్రీలు సహగమనం చేశారు. వీరు వీరాంగనలయేరు. ఈ రకం కథలు సన్యాసమ్మ కథ, కామమ్మకథ ఇత్యాదులు. ఇట్లు సామాన్య

లైనా సరే ఘన కార్యాలు చేస్తేసరి అనే సూత్రం ఏర్పడింది.

## ప్రధాన రసాలు

జంగం కథలు ఆదర్శవ్యక్తుల జీవితాలను చిత్రిస్తున్నాయి. వీరికి స్వసౌఖ్యం లాభం కంటె ధర్మం, న్యాయం ప్రధానాలు. అటువంటివారు తమ జీవితాన్ని బలిదానం చెయ్యడానికి వెనుక తియ్యరు. ఇటువంటి కథలు మొదటినుంచి చివరిదాక గంభీరంగా ఉండే అవకాశముంది. కాని కవియొక్క చాతుర్యంవల్ల ఇతర రసాలుకూడా ఉండవచ్చు. బాలనాగమ్మ కథకూడా తక్కిన కథలలాగే గంభీరమైనది. కాని కవి దీనిలో హాస్యరసాన్నికూడా జతపరిచేడు. హాస్యరసాన్ని నడిపించడం సామాన్యమైన పనికాదు. ఈ పనిలో ఈ కథకి మరొకరు సాటిరారు. గాంధారికథ కుమార రామునికథ, కమ్మవారి పణతి - పసుల బాలరాజు కథలలో హాస్యరసచ్ఛయలున్నాయి. హాస్యం సులువుగా జనులను వశం చేసుకొంటుంది.

ఈ కథలు సాధారణం గాదు: ఖపూరితాలుగా వున్నాయి. అట్టి దుఃఖానికి కారణాలు వేరు వేరు. కొన్నిటిలో సాంసారిక బాధలు, కొన్నిటిలో యుద్ధాలు, మత భేదాలు ఇత్యాదులు. కాని పర్యవసానం ఒక్కటే! దుఃఖం! కథావీరుల బాధలుచూస్తే చదువరికి గుండె ద్రవించి పోతుంది. ఇట్లు ఇవి కరుణరసపూరితాలు.

వీరుల కృత్యాలలో రౌద్రం కొన్నిచోట్ల కనబడుతుంది. కేవలం యుద్ధమేకాకుండ, వారి సంభాషణాదులు ధైర్యసాహసాదులను ప్రకోపింపచేస్తాయి. మొత్తంమీద దీనిని వీర రసమనడం సమంజసం. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ, కుమార రాముని కథా, సర్వాయిపాపడి కథ, బంగారు తిమ్మరాజు కథ, వీరబొబ్బిలి కథ ఇట్టివే! సాహస కృత్యాలు చేసేవారిలో ఆడవారు కూడ ఉన్నారు. ఇట్టివి గాంధారి కథ, కమ్మవారి పణతి - పసుల బాలరాజుకథ మొదలైనవి.

ఈ కథలలో రసాలు ఇంతేకాదు. వీటిలోవచ్చే కీలుగుర్రం, భారహజారి మొదలైన గుర్రాలు కొన్ని ఆకాశంలో ఎగిరిపోతాయి. చదువరులు ఆశ్చర్యపోతారు. కాటమరాజు కథలో బొల్లావుయుద్ధం వింతను గొల్పుతుంది. ఇదంతా అద్భుతరసంయొక్క ఫలితం. జంగం కథలలో ఇట్టి ముఖ్యమైన రసాలున్నాయి.

## దేశభక్తి

ఈజానపద గేయ వాఙ్మయంలో వీరరస కావ్యాలున్నా దేశభక్తి బోధనలైన రచనలు చాలాతక్కువ. స్వదేశరాజుల అంతఃకలహాలు మిక్కటంగా ఉన్నాయి. ఇవన్నీ మనలో మనం దెబ్బలాడుకోడమేగాని, మనదేశ స్వాతంత్ర్యాన్ని హరించడానికివచ్చిన వారిలో దెబ్బలాడడంకాదు. కాబట్టి దేశభక్తి కథలు చాలా మితంగా వున్నాయి. దేశభక్తి ప్రధానమైన కుమార రాముడి కథలో అది నొక్కి చెప్పబడలేదు. సర్వాయి పాపడికథ, వీర బొబ్బిలికథ దేశభక్తిని కొంతవరకు బోధిస్తాయి. చిన్నపరెడ్డి కథలోకూడ ఆఛాయలున్నాయి. వందల కొద్దీ ఏండ్లపాటు మనం పారతంత్ర్యం అనుభవించడానికి అదొక కారణం; వాఙ్మయంలో దేశభక్తిని బోధించే రచనలు విరివిగా లేకపోవడమే ఒక దురదృష్టం!

## ఆధ్యాత్మికం, మతం

జంగం కథలు న్యాయం, ధర్మం ప్రధానమైనవి. వీటియొక్క ఐహిక ప్రయోజనం ఒక్కొక్కప్పుడు తప్పిపోయినా ఆధ్యాత్మిక ప్రయోజనం తప్పదని చెప్పవచ్చు. సాంసారిక కథలకు, చారిత్రక కథలకు కూడ ఇంతే! హిందూదేశం మత ప్రధానమైనది. అయినా ఒక్కొక్క చోట అజ్ఞానం ఆవరించి వికృత రూపం దాల్చుతూంటుంది. చిన్నమ్మ వైష్ణవ భక్తురాలు, ఆమె అత్తవారింటి మతం శైవం. భక్తి ప్రధానమని భావిస్తే ఆమెను బోధించడంలో అర్థమేమయినా ఉందా? ఈ జానపద వీరులలో మతం మీద పట్టుదల విస్తారం. అది వారికొక

విశ్వాసం మాత్రమే కాదు. జీవితాచరణలో ఒక భాగం. వారు నమ్మిన దేవతలతో వారు తమ మిత్రులతో వ్యవహరించినట్లుగా వ్యవహరిస్తారు. దేశింగురాజు, బంగారు తిమ్మరాజు ఇత్యాదులకు వీర గుణ మెంత ప్రధానమో భక్తి అంతే. ఇట్టి వీరులు మనకు పూజనీయులు. పేరంటాలైన సన్యాసమ్మ, కామమ్మ కథలలో దైవభక్తి మరొక రూపాన ప్రజ్వరిల్లింది. ఈ వీరసముదాయం ఆదర్శ ప్రాయ మైనది.

## సందేశం

జంగం కథలిచ్చే సందేశమేమిటి? ప్రతి కథ లోను ఆధ్యాత్మిక ప్రభావం కనబడుతుంది. నాయకీ నాయకులు అద్భుత శక్తులు, ఆధ్యాత్మిక శక్తులు గలవారు. దీనికి స్త్రీ పురుష భేదం లేదు. వీరులే గాక చిన్నమ్మ గాంధారి, కమ్మవారి పణతి, కామమ్మ, సన్యాసమ్మ మొదలైన స్త్రీలు కూడా అంతే! ఈ గ్రంథాలు జనులకిచ్చే సందేశం ఆధ్యాత్మికమనే చెప్పాలి. యుగయుగాలనుంచి ఆంధ్ర దేశంలో వస్తూన్న సంప్రదాయం ఇది. ఈ వీరులు తాము ఎదుట పెట్టుకొన్న ఆధ్యాత్మికానందాన్నే ప్రజల యెదుట పెడుతున్నారు. ఇది చలనంలేని పునాది. ఇది ఆంధ్రులు సర్వదా తమ మనోక్షేత్రం ముందు ఉంచుకోవాలి.

## ప్రాచీనుల రచనా సంప్రదాయం

జంగం కథలు ఎన్ని రకాల సంప్రదాయాలను సృష్టించుకొన్నాయో చూశాము. ఇట్టివి కొన్ని ఇతర దక్షిణ దేశభాషలలోకూడ కనబడుతున్నాయి. 'తొల్కాప్పియమ్' అను తమిళ గ్రంథంలో ఇట్టివి కొన్ని చెప్పబడ్డాయి. "తొల్కాప్పియం పొరుళ అధికారమున తమిళ కావ్యవస్తువు, తద్వర్ణనా రీతు లను చెప్పబడు సందర్భమున-కావ్యములలో శృంగా రము గాని, వీర రసముగాని యాయా దేశ కాల విభాగముల కనుగుణముగానె వర్ణింపవలయునను నదొ కసమయముగా నేర్పడుటయే గాక దీనికిననుగుణముగా దేశకాల విభాగములు, పర్వతప్రదేశము, మరుప్రదే శము, అడవి ప్రదేశము, మాగాణి ప్రదేశము, సముద్ర ప్రాంతము. ఈ ప్రదేశములందు శృంగార వీర సంప్రదాయములగు కథలను వర్ణించునప్పుడు, కొన్ని ప్రత్యేక కవి సమయముల ననుసరించి చేయవలయు నను నియమము కలదు. ఒక్కొక్క ప్రాంతమునకు చిహ్నములగు రంగు పుష్పములు మొదలయినవి కూడ తెలుపబడినవి. శృంగార రసమైన పుడు నాయికా నాయకుల సమాగము పర్వత ప్రదేశమందు జరిగినట్లు, రాత్రి మొదటిజామున సంఘటిల్లినట్లును వర్ణింపవలయును. యుద్ధాది వర్ణనమున మొదట గోగ్రహణముతో ప్రారంభింపబడవలయును. అది పర్వత ప్రదేశమందే జరిగినట్లు సూచింపబడవలె. దాడి వెడలుటకు సంబంధించినది అడవి ప్రదేశము. ముట్టడి మాగాణి ప్రదేశములో జరిగినట్లును సూచింపవలె. విజయమునకు సంబంధించినది ఎడారి ప్రదేశము. ఇక పుష్పములలో ఎర్రనిరంగుగల పూవులు రుధిరస్రావముగల యుద్ధమునకు సూచకములుగా వర్ణింపవలెను. పసుపు పచ్చని పువ్వులు అప్రతిహతశక్తి చిహ్నములు. ద్రోణ పుష్పములు కోటను ముట్టడించు వారిచే ధరింపబడును. తెల్లని పుష్పములు విజయ చిహ్నములు. ఈ కవి సమయములన్నియు దేశీయములేగాని సంస్కృతాలంకారిక పద్ధతులకే మాత్రము సంబంధించినవికావు. కాని ఇతర భాషలలోకి రాలేదు.*

ఒక్కొక్క భాషలో కొన్నికొన్ని సంప్రదాయాలేర్పడినట్లుగా విశదమౌతుంది. కాబట్టి ఆంధ్ర దేశీయ కథలలోని సంప్రదాయాలను ఇతర భాషల లోని సంప్రదాయాలకు ఉండే సమానత్వం, భిన్నత్వం గురించి పరిశోధనలుచేసి ఇట్టి సంప్రదాయాలకు మూల మెక్కడ ఉందో గ్రహించవలసుంది. అంతేకాదు మన దేశీయ సంప్రదాయాలు మన

* కోరాడ రామకృష్ణయ్యగారి 'దక్షిణ దేశభాషా సారస్వతములు – దేశి' లోని 83, 84 పుటలనుండి గ్రహించబడింది.

గ్రాంథిక రచనలలో కొంతమట్టుకు ఎక్కడయినా కూడ కనుగొనవలసిన భారం కూడ పరిశోధకులమీద ఉంది.

## ఆదర్శీకరణంలోని ఒక ప్రధానలోపం

ఏదో ఒకవీరుణ్ణి తీసుకొని, అతనిలో ఉండే మానవలోపాలను కప్పిపుచ్చి, అతనికి సమానమైన వాడు స్వర్గమర్త్యపాతాళయంలో లేడని చెప్పడం ఒక పెద్ద లోపమని చెప్పక తప్పదు. ఈ మానవవీరుడు ఒక గొప్పవ్యక్తే కావచ్చు కాని మహాపురుషుల సరసను ఎంతవరకు నిలబెట్టతగ్గవాడు అన్నదొక ప్రశ్న. ఈ వీరునితో తులతూగేవారు ఇదివరకు ఎందరో పుట్టేరు! అటువంటి సందర్భంలో ఇతనికి నిజంగా ఉండడానికి అవకాశంలేని అద్భుత గుణాలను, శక్తులను ఆరోపించడం అతనియొక్క లోపాన్ని కప్పిపుచ్చడమే అవుతుంది. ఈ వీరుడు అద్భుతమైన తేజస్సుతో జన్మించి, పన్నెండేళ్ళకే సకల శాస్త్రపారంగతుడై, దేవతలతో మాట్లాడి, పరమాద్భుతమైన పనులన్నీ చేసి మరణించి మళ్ళీ బతికేడని చెప్పడం యథార్థానికి వ్యతిరేకం, ప్రపంచక జ్ఞానానికి ఒక దెబ్బ! వీరుణ్ణి అంత ఆదర్శీకరించడం న్యాయంకాదు. ఈ ఆదర్శీకరణానికి మూల మెప్పుడో పరిశోధించవలసుంది. దీనితత్త్వం తెలుగులో ఈ కింది మోస్తరుగా కనబడుతూంది. కాంభోజరాజుకథ, నల్లతంగాళ్ కథవంటి పాత కథలలోనేగాక మన గ్రాంథిక వాఙ్మయంలో ఇట్లు కనబడుతూంది. క్రీ. శ. 855 ప్రాంతంవాడైన కుమార సంభవ కర్తలో ఆంధ్రకవియైన నన్నెచోడుదేవుడు తన చక్రవర్తియైన గుణగ విజయాదిత్యుని (క్రీ. శ 848–891) కుమారస్వామిగాను, అతని తండ్రియైన కలివిష్ణువర్ధనుణ్ణి పరమేశ్వరుడిగాను కల్పించి మహాగ్రంథాన్ని సృష్టించేడు. అది ఎంతటి ఆదర్శీకరణమో (Idealisation) గమనించండి. ఆ కాలపు కన్నడభాషా పుస్తకాలలో కూడ ఈ పద్ధతి కనబడుతూంది. క్రీ. శ, 940 ప్రాంతంవాడైన పంప కవి తన రాజైన అరికేసరిని అర్జునుడితో సమంగాచేసి 'కిరాతార్జునీయ' కావ్యాన్ని రచించేడు. క్రీ. శ. 982 ప్రాంతంవాడైన రన్న కవి సహస భీమ విజయ (గదాయుద్ధ) అను కావ్యాన్ని రచిస్తూ తన రాజైన సత్యాశ్రయుడికి (తైలపుని కుమారుడు) సాహసభీమ అని పేరుపెట్టి మహాభారతంలోని భీముడు అతనే అనిచెప్పి గ్రంథమంతటా అతని చరిత్రను చేర్చేడు. ఈ రకపు రచనలలో ఉండేలోపం బట్టబయలుగా ఉంది. శ్రీకృష్ణుడు, శ్రీరాముడు ఇత్యాది అవతార పురుషులతో భూమిమీద పుట్టిన ప్రతివాణ్ణి సరిపోల్చడం ఒక అవివేకమే! ఒకే సమయంలో బోలెడుమంది శ్రీరాములు, శ్రీకృష్ణులు పోలికను అందకుండ బయలుదేరుతారు, అసలు అవతార పురుషుల గౌరవమే పోయింది. ఈ లోపాన్ని అటు తర్వాతివారు తెలుసుకొన్నారు. పదకొండో శతాబ్దం వచ్చేసరికి గ్రాంథిక కావ్యాలలో ఈ ధోరణి తమమూ మారిపోయింది, నన్నయ్యభట్టు మహాభారతాంధ్రీకరణను ప్రారంభించేడు. కాని పూర్వపు సంప్రదాయాన్ని త్యజించేడు. రాజనరేంద్రుణ్ణి పట్టుకొని ధర్మరాజనికాని, భీముడనికాని మరెవరనికాని కథాపాత్రల చూపించలేదు. ఈ నూతన పద్ధతే తర్వాతి గ్రాంథిక కవులకు ఆదర్శమయింది. మతప్రధానమైన వీర శైవ కవుల రచనలలో మత కారణంగా వెనకటి పద్ధతి మిగిలిపోయింది. సామాన్య ప్రజాకవులలో మార్పురాలేదు. కాబట్టి జంగం కథలన్నీ ఇట్లేఉన్నాయి. వీటిలో అసలు వీరునియొక్క గుణగణాలను కనిపెట్టలేము. జరిగిన కథ తెలియకపోతూంది, కల్పిత కథే దిక్కవుతూంది. అసలు చరిత్రలోని కుమారరాముడు, జంగం కథలోని కుమారరాముడు వేరువేరు వ్యక్తులని చెప్పవచ్చు. దేశచరిత్రలో కుమార రాముడనే వ్యక్తి వున్నట్టుగానె కనపడదు. కాని జంగంకథలో అతను మహావీరుడయేడు. ఈ కథలు అభూత కల్పనలకు కూడ తావయేయి.

—(౦)—

# హితోపదేశము

దశభాషావిశారద కోట సుందరరామశర్మ



మాటలందు మంచిమరియాద లరయుచు
కలిపికొలుమాట గణనచేసి
చచ్చుపుచ్చులేరి హెచ్చుగునర్థమ్ము
కవితలందు పలుకు కవికుమారి!

వట్టి చప్పుడులకు వంచన పడబోకు
బోలుశబ్దములను ద్రోలివేయు
పడగ నీకు మెపుడు పడికట్టురాలను
కవిత వెలితిపడును కవికుమారి!

తలపు దెలుపునపుడు పలుకులు వెలకట్టు
చూడ జనదు దొంగ సొమ్ము కొఱకు
తలపు పలుకు రెండు తగిలి యుండేలాగు
కలము శక్తిజూపు కవికుమారి!

పాతకవితయందు పాటవమున్నది
గేయకవితయందు హాయికలదు
రెండు దెలియవలయు నిండుగా నీనాడు
కవితపలుకదలచు కవికుమారి!

ఆటవెలదిలోని యందములను జూచి
తేటగీతిలోని నీటు దెలిసి
కందమందుగలుగు కమ్మందనము గాంచి
కవితల్లుమమ్మ, కవికుమారి!

సీసములను గల సమాసశక్తిని బట్టి
ద్విపదలోన నరసి తియ్యదనము
మత్తకోకిలందు మాటలపసగని
కంఠమెత్తిపాడు కవికుమారి!

కలువదండలల్లు కలిపి చంపకముల
పులుల నేనుగులను కలిపికొనుము
మెత్తదనము కొఱకు మెయిఠీవికొఱకును
గట్టియుసురుతోడ కవికుమారి!

## అఖిలాంధ్ర సాహిత్య సమ్మేళన మహాసభ

భారతదేశములోని ప్రముఖ దేశభాషాసాహిత్యము లన్నింటిని సమ్మేళనపఱచి తద్వారా భారతదేశ కళ్యాణము నుత్తమమును ఉన్నతమును నగు మార్గములలో సాధించుటకై మన భారత ప్రభుత్వము అఖిల భారత సాహిత్య పరిషత్తు నొకదానిని స్థాపించదలచినదని యిదివఱకె మనమందరము పత్రికా ముఖమున చదివియున్నాము.

ఆ పరిషత్తునందు మన ఆంధ్ర సాహిత్యముకూడ ప్రాతినిధ్యము పొందవలెనన్నను, ఆ పరిషత్తుమూల మున కలుగు ప్రయోజనమును మన ఆంధ్రదేశముకూడ సమగ్రముగా పొందవలెనన్నను మన ప్రాంతమునందు కూడ సమగ్ర ప్రాతినిధ్యముకల ఒక కేంద్ర సంస్థ యేర్పడి పని చేయవలసియున్నది. అట్టి సంస్థ నేర్పాటు చేయుటకై పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు నగరమున ఒక ఆహ్వానసంఘ మేర్పడి నిర్విరామకృషి సల్పుచున్నది. అఖిలాంధ్రసాహిత్య సమ్మేళన మహాసభలు జనవరి మొదటివారమున జరుగనున్నవి.

ఆ సభలయందు విశాలాంధ్రము నందలి అన్ని ప్రాంతముల కవులు, పండితులు, కవయిత్రులు, విదుషీమణులు, రచయితలు, రచయిత్రులు పాల్గొని సభా కార్యక్రమములను విజయవంతములుగా నిర్వహించుటకై తోడ్పడగోరుచున్నాము. సభా కార్యక్రమములందు దేశదేశములందలి ప్రముఖులెందరో పాల్గొననున్నారు.

ఆ సభలయందు నృత్య, నాటక ప్రదర్శనములు, చిత్రకళా ప్రదర్శనము, గ్రంథ ప్రదర్శనము మున్నగు ప్రదర్శనము లెన్నో ఆకర్షణీయముగను, విజ్ఞానప్రదముగను నిర్వహింపబడనున్నవి.

కావున సాహితీవేత్తలును, కళోపాసినులును అగు మహనీయురాంద్రందఱును ఆ సభలయందు పాల్గొని మాకు తోడ్పడ గోరుచున్నాము.

సభకు ప్రతినిధి రుసుము మూడురూపాయిలు మాత్రమే.

సభా సమయమునజరుగు ప్రదర్శనములలో ప్రదర్శించుటకై తాము చిత్రించిన చిత్రపటములను, తమరు రచించిన గ్రంథములను పంపి సోదరీమణులెల్లరు సహకరింప గోరెదము.

స్త్రీల శాఖకు సంబంధించిన వివరములు తెలియగోరువారు నాకు వ్రాసిన బదులగలరు.

బాపట్ల
4-11-53

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
అఖిలాంధ్ర సాహిత్య సమ్మేళన మహాసభ (స్త్రీలశాఖ)

 # వాణి 

శ్రీ ఉమామహేశ్వర్ బి. ఎ.

శ్రీనివాసరావు వయస్సు 56. రిటైర్డు సీనియర్ డిప్యూటీ ఇనెస్పెక్టరు ఆఫ్ స్కూల్సు. రెండు, మూడేళ్లనుంచి దగ్గూ, ఆయాసంచేత చిక్కినా ఆరడుగుల విగ్రహానికి తగినంత లావుకూడా ఉంటాడు. చాలా సాధుస్వభావము, సత్యబుద్ధి కావటమువల్ల డబ్బు వచ్చే ఉద్యోగమైనా ఎక్కువ ప్రోగుచెయ్యలేదు. ఆయన ఉద్యోగములో నుంచి ఫింఛన్ పుచ్చుకోక పూర్వమే అనారోగ్యమువల్ల గృహనిర్వహణములో కలిపించుకునేవాడు కాదు. సంస్కృతమంటే ఇష్టం. కూతురైన వాణిని విద్వాన్‌కు చదివిస్తున్నాడు. పట్టభద్రుడైన అల్లుడురావాలని ఉద్దేశ్యము.

సుందరమ్మ శ్రీనివాసరావు భార్య. వయస్సు 50. కాయపారు శరీరము అవటమువల్ల 40 యేళ్లు ఉన్నట్లు కనుపిస్తుంది. ఆకారము చాలా చిన్నది. గొంతుకమాత్రము పెద్దది. ఎక్కువఎరుపు లేకపోయినా ముఖము కళగానే ఉంటుంది. సొమ్ములంటే విశేషమైన అపేక్ష. తాను ఉద్యోగస్థుని పెళ్లానని గర్వపడుతుంది. చిన్నప్పుడు నేర్చుకున్న కుశలాయకము, లంకాదహనము పాటలు తప్ప యేమీ రాకపోయినా ఇంగ్లీషు మాటలకుకూడా అర్థము చెప్పటానికి ప్రయత్నిస్తుంది. ఇంగ్లీషు రాని అమాయకపు స్త్రీలముందు గాంధిగారు మొదలుకొని గాసులైటు మెకానిజమువరకు ఆమె కావించే దీర్ఘోపన్యాసాలు ఆమె ఊహాశక్తిని వెల్లడిస్తాయి. వాణికి ఇంకా పెళ్లి కాలేదని విచారము.

వాసుదేవరావు సుందరమ్మ తమ్ముడు. వయస్సు 35. ప్లీడరీ ప్రాక్టీసు పెట్టి ఐదేళ్లయింది. తండ్రి పోలిక అవటమువల్ల మందసునిగా ఉంటాడు. తను ఏపనిచేస్తున్నా తనవృత్తిని మరచిపోడు. స్వప్రయోజనము కోసరము అసత్యాన్ని, సత్యము సత్యాన్ని, అసత్యము చెయ్యటానికి జంకూ గొంకూలేదు. ఈ పనిచేతవచ్చా అది రాదూ అనిలేదు. అన్నీ చేయగలడు. బాగా తెలుసు లోకవ్యవహారాలు. అక్కగారికి అన్నిసమయాల్లోనూ కుడిభుజమై వర్తిస్తాడు.

## 1-వ రంగము

సమయము:- జ్యేష్ఠమాసము చివర. ఉదయము పది గంటలు. కొద్దిగా వడ గాలి వేస్తూంటుంది.

ప్రదేశము:- శ్రీనివాసరావుగారింట్లో సావిడి. వార్నీసు మాసి పోవటమువల్ల పాతదల్లే కనుపించే విశాలమైన బల్ల. మాపుపైకి కనుపించకపోయినా దుమ్ముతో నిండిన బందరు కలంకారి బల్ల గుడ్డ, దాని చుట్టూ నాలుగుకొత్త పోలిషు కుర్చీలు. ఒక ప్రక్కగా ఎక్కువ వాడుకవలన నల్లబడ్డ పేము గలలౌంజి. టేబిలుకుపైగా గోడమీద లక్ష్మి, సరస్వతుల పెద్దపటాలు. కిటికీకి పైగా నటరాజుపటము.

పాత్రలు:- శ్రీనివాసరావు గ్లాసుకోపంచ, చొక్కా కొద్దిగా మధ్యమధ్య దగ్గుతూ లౌంజీలో పడుకొనియుంటాడు.

సుం:- ఎఱ్ఱడోరియాల నూరొనెంబరు చీర, జరీ పేటు రవిక అసలే చిన్నదైన తన మూతిని బిగించి భర్త వైపు కోపంగా చూస్తూఉంటుంది నటరాజుపటం దగ్గిర.

సుం:- లోకం అంతా నన్నంటున్నారు వాణికి ఇంకా పెళ్లి చేయలేదని. అక్కడ యేదో నా యిష్టం నే వెలిగిస్తున్నట్లు.

శ్రీని:- నేనేమి చేసేది? ఏడాది సెలవుపెట్టి కాలేజీల వెంట తిరిగినా, నా ఆరోగ్యం పాడయిందికానీ వాణికి తగ్గ పిల్లవాడే దొరకడాయ.

సుం:- అదికాదు మీ పిన తల్లి యెందు కట్లా తిట్టుతుంది - అప్పా, తమ్ముడుఇష్టాలు - సంవర్తాదంద్దే పెళ్లి చేస్తారా? మాలాంటి ముసలిముండలు నీ ఇంట్లో నీళ్లుతాగి పోతారేమో అనీ — (కళ్లనీళ్లు పెట్టుకుంటుంది)

శ్రీని:- (అర్థోక్తిలో) ఏమన్న దేం?

సుం:- వాసు కొంపకు చేటు తెస్తున్నాడుట. పాపం! జ్యేష్ఠమాసం ఎండంతా వాడి పాలే పడింది కదా! మీరు వెళ్లలేరాయ్, నేవెళ్లకూడదాయ్? ఎవరు వెళ్లుతారు చెప్పండి.

శ్రీని:- ఏదో ఆమె తొందరపడ్డదిలే. అసలు సంగతులు ఎవరికి తెలుస్తాయి. ఆడ పిల్లల్ని కన్న వాళ్ల బాధ లిట్లాగే ఉంటాయి.

సుం:- (గేటు వైపు చూస్తూ సహర్షంగా) వాసు వస్తున్నాడండీ.

(వాసు వచ్చి కూర్చీలో కూర్చుంటాడు)

సుం:—జితూరంవారికి ఎంత ఆస్తిఉంది? పిల్లవాడు బాగుంటాడా? ఎన్నేళ్లు? ఏమినగలు పెడతారు?

వాసు:—నలభై ఎకరాలమాగాణి, మిగిలిందంతా మెట్ట. పిల్లవాడికి ఇరవైయేళ్లు, విగ్రహము బాగానే ఉంటుంది. మూడువేలుసొమ్ము పెడతారుట.

సుం:—మంచి సంబంధమేనే? తాంబూలాలు పుచ్చుకోటానికి రమ్మనకపోయినావూ?

శ్రీనివాసు:—పిల్లవాడు ఏమిచదువుతున్నాడు?

సుందరమ్మ:—ఇంట్లో మగవాళ్లు ఎవరూలేరు. వాళ్ల అమ్మమ్మ మాత్రము 'పిల్లవాడిని టెలిగ్రాము దాకానన్నా చదివిద్దామనుకున్నాము, తల్లిని వదిలి ఉండలేదని ఇంకా బస్తీకి పంపలేదు, అన్నది.

శ్రీని:—సరేలే! టెలిగ్రాందాకా చదువుఏమిటి?

వాసు:—అంటే టెలిగ్రాం అర్థంచేసుకునేటంత ఇంగ్లీషు చదువుట.

శ్రీని:—వాణిని వాడికియ్యడంకంటె నూతిలో దింపింది మేలు.

వాసు:—దారిలో ఇంకో సంబంధంవిన్నా.

శ్రీని:—పిల్లవాడు ఏమిచదువుతున్నాడు?

వాసు:—బొంబాయిలో యల్. సి. పి. యస్ పాసై డెంటిస్ట్రిస్పెషలైజు చేస్తున్నాట్ట.

సుం:—అయితే డి. ఇ. ఒ. ఉద్యోగము చేస్తాడా?

శ్రీని:—తెలియకపోతే ఊరుకోనన్నా ఊరుకోవేం? డాక్టరు చదవటము ఏమిటి? డి. ఇ. ఒ. ఉద్యోగము ఏమిటి? వాళ్లింటి పేరేమిటివాసూ!

వాసు:—కందుకూరివారుట.

శ్రీని:—అలింగధారి సంబంధం మనకెందుకులే.

వాసు:—అక్కయ్యా! చిన్నబావ ఏదో సంబంధం విచారిస్తున్నానన్నాడే. ఉత్తరం వ్రాశాడా?

సుం:—మీపెద్ద బావకు జబ్బువల్ల బద్ధకం అయితే ఆయన పుట్టుకలోనే సోమరిపోతు. వాళ్లు నాగపూరువెళ్లిన పదిహేనేళ్ళలో ఏపది ఉత్తరాలు రాశారో!

శ్రీని:—ఆయన్ను అట్లా ఆడిపోసుకుంటావేం? మీ చెల్లికి ఏమిజబ్బు? అది రాయగూడదూ!

పోస్టుజవాను:—ఉత్తరమండీ పంతులుగారూ.

వాసు:—అదిగో! బావే రాశాడు.

"మాతోపాటే ఇక్కడకువచ్చిన లక్ష్మీనరసింహముగారి తమ్ముడికి సౌ॥ వాణిని ఇయ్యవచ్చు. అతడు బి. ఏ. పాసై మిలిటరీ ఎకౌంట్సు సర్వీసులో ఐదుయేళ్ళనుంచి క్వెట్టాలో ఉన్నాడు. వయస్సు పాతికా. అందంగానే ఉంటాడు. పదవ తేదీన లక్ష్మీనరసింహముగారు అక్కడకు వస్తారు. తాంబూలాలు పుచ్చుకోండి."

శ్రీని:—పదవ తారీఖు నీకేమి వాయిదాలులేవుగా వాసూ! అయన్ను కేప్ చేశావంటే సంబంధం కుదురుతుందోయి.

వాసు:—ఉంటే మాత్రము ఏమిలెండి? మా శివ రావును చూడమంటా!

(లోపలనుంచి)

అమ్మా! పంతులుగారిని మడిగట్టుకోమనండి వంటయింది.

(తెర)

## 2-వ రంగము

సమయము:-పదవ తేదీ పగలు రెండుగంటలకు.

ప్రదేశము:—అక్కగారియింట్లో వాసు దేవ రావు అఫీసుగది, లాయర్లు ఉపయోగించే పెద్దబల్ల, దానిమీద ఆల్ ఇండియా రిపోర్టులు, యూని వర్సిటీయాక్టు, ఆక్సుఫర్డు డిక్షనరీ, చుట్టూ దృఢ మైన రోజ్ ఉడ్ కుర్చీలు.

పాత్రలు:—వాసు సేలం జరీపేటుపంచ, సిల్కుటీ చొక్కా, కుర్చీమీద సేలంసిల్కు కండువా ఆక్సుఫర్డు డిక్షనరీ చూస్తూ ఆలోచిస్తూ ఉంటాడు.

లక్ష్మీనరసింహము:—వయస్సు 40, నెత్తిన టోపీ, ముఖాన తిరుచూర్ణపుబొట్టు, తెల్ల కా టి న్ లాంకోటు, గ్లాసుకోపంచ, రోల్డుగోల్డు కళ్ళ జోడూ, చేతిలో లెదర్ బాగ్.

వాసు:—పేరికి పెళ్లిగీత లేదన్నట్లు ఈ సంబంధం కూడా తప్పిపోతుందా. యేం చెప్మా! పిల్లకు కాలేజీచదువు కావాలిట. సరే! నా తెలివి ఉపయోగించిచూస్తా! ఈ లీగలు అధారిటీ ఎవరు కాదనగలరు? రెండు గంటలబండి ఈ పాటికివచ్చి ఉంటుంది.

(లక్ష్మీనరసింహముగారు ప్రవేశిస్తారు)

వాసు:—లక్ష్మీనరసింహముగారూ! నమస్తే! ఇట్లా దయచెయ్యండి.

నరసింహం:—నమస్తే! నేను మొదట పిల్ల చదువు కుంటోంది అంటే ఎక్కడో సరిగా కనుక్కో లేదు. 'కాలేజియన్' అయితేకాని చేసుకో నని. మావాడు వైరిస్తే మీకు వ్రాశాను. ఎక్కడ చదువుతోంది అమ్మాయి?

వాసు:—ఇక్కడే నేషనల్ కాలేజీలో ఈ యేడే యూనివర్సిటీ పరీక్షకు వెళ్లుతుంది.

నర:—సరే మంచిదే! (లెదరు బాగ్ విప్పి) మావాడ్ని మీరెరుగరుగా? ఇదిగో ఫొటో చూడండి.

వాసు:—లా కాలేజీ ప్రిన్సిపాలు మెట్కాఫ్‌దొరల్లే ఉన్నాడే?

నర:—ఇప్పుడు క్రాపు పోయినప్పటినుంచి మరీ దొరలపద్ధతి అలవాటయిపోయింది. కొంపతీసి మీ యింట్లో ఎవరూ సనాతనిస్టులు లేరుగదా?

వాసు:—ఏమి ఫరవాలేదులెండి. సర్వము నాకు వది లేరా అంటే నేను సర్దుకొస్తా. మీకేమైనా కావలంటే నన్నడుగుతూ ఉండండి.

నర:—రేపటినుంచి మావాడికి పదిరోజులు సెలవిచ్చా రుట. అక్కడనుంచి వచ్చేటందుకే నాలుగు రోజులు పట్టుతుంది.

వాసు:—అయితే 15—వ తారీఖు ముహూర్తమే ఖాయమా?

నర:—అది తప్పితే సెలవు వాడికి దొరకదు.

వాసు:—మరీ వ్యవధిలేదే? ఎంత బజారునుంచిచేసిన సరుకులు తెచ్చినా అప్పడం వడియం పెట్టాలా?

నర:—మాకు మలబారు అప్పడాలువేసినా అభ్యం తరంలేదు.

వాసు:—సరేలెండి, ఆ ముహూర్తమే ఖాయం.

(తెర)

## 3—వ రంగము

సమయము:—జ్యేష్ఠ బహుళత్రయోదశి, ఉదయము తొమ్మిది గంటలు.

ప్రదేశము:—కాగితపు పూలతోను, విద్యుద్దీపాలతోను అలంకరించబడ్డ విశాలమైన పెళ్లి పందిరి, మధ్యలో

వివాహవేదిక. వరపూజ అయిన తరువాత పెళ్లి వారు మేళాలతో వస్తూఉంటారు.

పాత్రలు:—శ్రీనివాసరావు బంధువర్గము. వాసుదేవ రావు హడావిడిగా తిరుగుతూ ఉంటాడు.

పెండ్లికొడుకు పూర్తిపేరు రాజశేఖరరావు. 'శేఖర్' అని అంటారు. ఆరడుగులఎత్తు, కండలు తేరిన పచ్చటి శరీరం, ఎడమకాలిమీదికి కుచ్చెళ్లు పడేటట్టు పంచకట్టు, కొత్త చొక్కా, కోటు మంగళస్నానాలుచేసి ఈ బట్టలు వేసుకుంటాడు.

వాణి:—విప్పారిన ముఖము, జరీచీర, సిల్కు జంపరు.

శ్రీని:—ఎఱ్ఱపట్టుబట్ట, కండువా; సుందరమ్మ అదే రంగుచీర రవిక.

శ్రీని:—వాసూ! ఏమిటోయి ఆ పెళ్ళికొడుకు వేషం. చొక్కా, కోటూ విప్పకూడదూ?

వాసు:—బావా! మనము ఏమైనా అన్నామా అంటే పెళ్ళికొడుక్కు కోపము వస్తుంది. సంబంధం ఇంతదాకావచ్చి తప్పిపోయిందంటే వాణికి పెళ్లిచేయుటము నాకుకాదుగదా నన్ను పుట్టించినవాడికికూడా చేతకాదు.

♦ ♦ ♦

శేఖరు:—చీకాకుగా కూర్చుంటాడు.

వాణి:—శ్రద్ధగా మంత్రాలు వింటూ ఉంటుంది.

♦ ♦ ♦

పురోహితుడు:—"మాంగల్యతంతునానేన మమజీవన హేతునా కంఠేబధ్నామిసుభగే సాజీవ శరదాంశతం" మంగళసూత్రం కట్టండి.

శేఖరు:—(ఒక ముడివేసి) నాన్‌సెన్సు, చెయ్యంతా పసుపు.

పురో:—మిగతా ముళ్లు వేస్తాడు.

♦ ♦ ♦

నర:తలంబ్రాలు పొయ్యకపోతే పీల్లేదురా నాయనా!

శేఖరు:—ఛా! ఛా! ఒళ్లంతా పసుపు అవుతుంది. కళ్లనిండా పడుతాయి నే పొయ్యను.

నర:—సరే! కొద్దిగా పసుపు వెయ్యమంటాలే. పోనీ! తడవకు నాల్గుగింజలన్నా వెయ్యి.

శేఖరు:—(చీకాకుతో) ఊఁ!

♦ ♦ ♦

పురో:—తండులదానం కృత్వా, ఉలవలు అందుకోండి.

శేఖరు:—(అర్థంతెలియక) ఏమిటో!

వాణి:—వడ్లు పెళ్లికొడుకుచేతిలో పోస్తుంది.

సభాపతి:—ఓరి! నీ దుంపతెగ. తండులాలంటే తెలియనిముండమోపి పౌరోహిత్యం ఏడవకపోతేయేం?

♦ ♦ ♦

శేఖరు:—(అగ్నిహోత్రంలో సిగరెట్టు అంటించి పురోహితుమీద పొగ ఊదుతూ.) హోప్‌లెస్, బోరింగ్ ఇంకా కాలేదయ్యా.

పురో:—శ్రీరామ రామ! ఏం ఖర్మరా బాబూ! అయిందండీ.

"శతమానంభవతి, శతాయుష్యేవేంద్రియే ప్రతితిష్టతు."

(తెర)

## 4-వ రంగము

సమ:—రాత్రి తొమ్మిది గంటలు.

ప్రదే:—శ్రీనివాసరావుగారి యింట్లో మేడమీద పడకగది. గదికి చాల కిటికీలు ఉండుటంవలన వేసవికాలమైనా ఏదో కొద్దిగా వేడిగాలి వేస్తోంది. క్రిందనుంచి బహుప్రయాసపడి పైకి వచ్చిన మాలతీ లత కిటికీ చువ్వలకు చుట్టుకొని దివ్యసౌరభం వెదజల్లుతోంది. గదిలో కాళిదాసు భావాన్ని చిత్రించిన రవివర్మ చిత్రం. దాని క్రిందే ఒక రోజ్ఉడ్ బల్ల. ఫ్లవరు వేసులో జాజియాలు, గులాబీలు, బొడ్డుమల్లె కొమ్మలు, మాలతీగుత్తులు ఉన్నాయి. బల్ల

మీద ఒక ప్రక్కన అక్బరీలు, జహంగీరులు, బహదూరుషాలు రజిత పీఠాన్ని అధిష్ఠించాయి. ఇంకోవైపు లమ్లీబిస్కట్లు, చాకలెట్లు, టీట్రే ఉన్నాయి.

ఒక లౌంజి, రెండు లేడీచెయిర్సు, రోజ్ ఉడ్ డబుల్ కాట్, స్ప్రింగు మేట్రెస్ తెల్లని దుప్పటి.

పాత్రలు:—శేఖరు జరీఅంచుతో మెరుస్తున్న ఇస్త్రీ పంచ బిళ్ళగోచీపెట్టి కట్టుకుంటాడు. సిల్కు పొడరుతో ఉతికినకేంబ్రిక్ సిల్కులాల్చీ, శిరోజాలుమధ్య పాపిటవలన రెండు ప్రక్కలకుపోయి తాతారోజునూనెవాసన వెదజల్లుతున్నాయి. క్లీను షేవ్ నేత్రాలు ఆసక్తితో కూడుకొని ఉజ్వలంగా ఉంటాయి.

వాణి వయస్సు 15. నేషనల్ కాలేజీలో చదువుతున్నా మంచి విజ్ఞానం వివేకంకలది. సన్నగా పొడుగ్గా నాజూకైన దేహము. ముంగురులతో కూడిన ముద్దుముఖము, గుండ్రటి లేతమామిడిరంగు కుంకంబొట్టు, పెద్దబోర్డరుగల లేతనీలపు సిల్కుచీర, అదేరంగు జంపరు, సవరాలతో పొడిగింపబడ్డ పొడుగాటి వాలుజడ. మెల్లతలుపుతోసివచ్చి కొంచెము సిగ్గుగాను, సంతోషంతోను లౌంజిలోపడుకున్న శేఖరంవద్దకువచ్చి నిలుచుంటుంది.

శేఖరు:—బిసీటెడ్ వాణీ (ప్రక్క కుర్చీపై చెయ్యి చూపిస్తాడు.)

వాణి:—అర్థం తెలియకపోయినా భావం గ్రహించి కూర్చుంటుంది.

శేఖరు:—(ముఖంవైపుచూచి, కాస్త సంతోషంతో) ఇంతకంటే బాగా పెద్దలోలకులు పెట్టుకుంటారు బొంబాయివాళ్లు.

వాణి:—వీటికంటే పెద్దవి బాగుండవని ఇట్లాచేశాడు మావీరాచారి.

శేఖరు:—మీ ప్రిన్సిపాలు పేరేమిటి?

వాణి:—శిరోమణి ప్రతివాది భయంకరాచార్యులు.

శేఖరు:—సంస్కృతపు పండితుడు కాలేజీప్రిన్సిపాలా? ఏంగ్రూపులున్నాయి మీ కాలేజీలో?

వాణి:—మా కాలేజీలో వాళ్లంతా సంస్కృతం చదువుకునేవాళ్ళే.

శేఖరు:నీవేదో యూనివర్సిటీ పరీక్షకు వెళ్లుతున్నావు అన్నారే?

వాణి:—ఔను విద్వాన్ పరీక్షకు.

శేఖరు:—ఖూనీ! ఖూనీ!

వాణి:—(గాబరాతో) ఏమిటది?

శేఖరు:—నేనింకా నీకు ఇంగ్లీషు డాన్సుకూడా వచ్చునేమో ననుకున్నాను. మిసెను, 'మోరిసు మీ కపులుకు బాల్ చేస్తానన్నది.' నీకు ఇంగ్లీషే రాదన్నమాట.

వాణి:—ఫస్టుఫారందాకా చదువుకున్నా. ఆ బడి దూరం అవటంవల్ల మావాళ్లు సంస్కృత కళాశాలలో చేర్పించారు.

శేఖరు:సంస్కృతానికి కళాశాలకూడానా?

వాణి:—అట్లా అంటారేమిటి?

శేఖరు:—అది మృతభాష. ఆ కావ్యాలనిండా కామ వ్యాపార ప్రసంగం. ఆ పాత్రలన్నీ అచ్చుబోసిన బొమ్మలు.

వాణి:—ఎవరండీ మీకివన్నీ చెప్పింది?

శేఖరు:—ఎవరేమిటి? రెడ్డిగారు చెప్పలా?

వాణి:—బలేవాళ్ళే దొరికారులెండి మీకు?

అందుకే అన్నాడు శక్తిభద్రుడు "బాలా పరప్రత్యయాః" అని.

శేఖరు:అంటే.

వాణి:—పరులమాట నమ్మేవాళ్లు పసిపిల్లలతో సమానం అని.

శేఖరు:—అంతేనంటావు.

వాణి:_కాకపోతే ఏమిటండీ? మా కాలేజీలో శర్మ గారు ఉపన్యసిస్తూ చెప్పారు. జర్మనీలో గెటే అనేకవి ఉన్నాడుట.

శేఖరు:ఆ! ఆ! అతను గొప్పవాడేలే.

వాణి:_అతడు కాళిదాసు 'శాకుంతలం' చదివి గంతు లేశాడుట. స్వర్గమర్త్య లోకాలమధ్య సోపాన పరంపర అంటూ ఉంటే అది 'శాకుంతలమే' అన్నాడుట.

శేఖరు:_అంత గొప్పవాడా కాళిదాసు?

వాణి:_దుష్యంతుడు, శకుంతల తెలుసుగా?

శేఖరు:_ఆ తెలుసులే.

వాణి:_వాళ్లిద్దరు అడవిలో ఓ చెరువుగట్టున కూర్చున్నారు. దుష్యంతుడు తామరాకు దొప్పచేసి దాంతో మంచినీళ్లు తెచ్చుకున్నాడు. ఇంతలో శకుంతల లేడిపిల్ల అక్కడకు వచ్చింది. దుష్యంతుడు దానిచేత నీళ్లు తాగించబోయాడు. అదేమో భయపడి పారిపోయింది. శకుంతల ఆ దొప్ప తన చేత్తో పట్టుకుంది. లేడిపిల్ల గబగబా నీళ్లు తాగింది.

శేఖరు:-చాల సైకలాజికల్ గా ఉన్నదే?

వాణి:_అప్పుడు దుష్యంతుడు శకుంతలతో ఏమన్నాడో తెలుసా-"దూళావా! ఎవళ్ళకైన వాళ్ల వాళ్ళమీద నమ్మకం! మీ ఇద్దరూ అడవిజంతువులు" అన్నాడు.

శేఖరు:కేపిటల్-ఏమిచమత్కారము (నవ్వుతూలేచి) నా సిగరెట్టుపెట్టెయేదీ!

వాణి:_టేబిలుమీద ఉన్నట్టుంది. తెస్తా.

శేఖరు:_(లేచివెళ్లి వాణిప్రక్క నిలుచుంటాడు.)

వాణి:_(ఫ్లవరు వేసుచూస్తూ) ఈ ఇంగ్లీషు పువ్వులు రంగులపసేగాని ఒక రవ్వైనా వాసనుందీ! మన పువ్వులు చూడండీ! ఏమిపరిమళమో! (పళ్లెంలో పూలు మీద విసరుతుంది.)

శేఖరు:_తలంబ్రాళ్ల మనస్సు తీర్చుకుంటున్నావే?

వాణి:_అన్ని మనసులూ!

(తెర)

---

# చివరకేమీ లేదు

శ్రీ వడ్డెంగుంట అంకయ్య

రాము సుశీల అన్యోన్య ప్రేమానురాగాలతో, చిలుక గోరంకల్లాగా సుమారు నాలుగేండ్లు గడిపారు. పాపం ఎందుకొచ్చిందో వచ్చింది వారిద్దరి మధ్య కీచులాట. రాము వట్టి బెట్టుసరి మనిషి. పైగా తన పట్టినకుందేటికి మూడే కాళ్లంటాడు. పోని సుశీలయినా సర్దుకుపోతుందేమోనంటె అట్లు సర్దుకుపోయె మనిషి కాదు. తన ముక్కు-కు సూటిగ పోయేది. ఒకరు చెప్పేది వినదు సరిగదా! నలుగురేమైన ననుకుంటారేమోనన్న భయంలేదు. తానుచేసిందల్ల మంచి పనేననుకుంటుంది. మాట్లడిందల్ల మంచిమాటేననుకుంటుంది.

ఇటువంటి తత్త్వముగలవారెంత చిలుక గోరంకల్లాగున్నా, ఎంత మెలివేసిన త్రాడులాగున్నా, ఎంత ప్రేమానురాగాలతో నీవే నేను, నేనేనీవనుకున్నా, దంపతులమధ్య కీచులాట రాకపోతుందా? వస్తుంది–తప్పక వస్తుంది. కొంతమంది ఆ కీచులాటనే ప్రణయకలహముగ ప్లేటు మార్చుకొని, దానిలోనుండే మాధుర్యాన్ని చవిచూస్తారు. కొంతమంది ఆ కీచులాటనే పెంచి పెద్దదిగ చేసుకొని, భార్యకు నాలుగు వడ్డించి, తను నాలుగురోజులు తిండి తిప్పలులేకుండ ఏ కాఫీహోటలులోనో తిష్ట వేస్తారు. మరొక తెగవారు భార్య చేతనే నాలుగు బహుమతులు పొంది అంత వరకు తృప్తిజెంది బయటపడి కాలికి బుద్ధి చెప్పుతారు. మన రాముని ఏతరగతిలో కూర్చొన బెట్టుతారో ఆ భారము మీకే వదులుతాను.

రాముకు బండెడు కోపము. ఆ కోపానికి తోడు నిప్పుకు గాలితోడయినట్లు సుశీల విరుద్ధముగానే నడుస్తుంది. పోనీ వాండ్లిద్దరి మధ్యన వచ్చిన గొడవలు సరిదిద్దటానికి పెద్దవాండ్లెవరైన ఆయింట్లో వున్నారంటె అదీలేదు. ఇద్దరేఇద్దరు. వాండ్లే అరుచుకోవాలి, వాండ్లె సర్దుకోవాలి. ఇంతకుముందెన్నో చిన్నచిన్నవి, పెద్దపెద్దవి కీచులాటలు వచ్చినవి కాని అంతగవిషమించలేదు. ఒక వేళ విషమించినను మూడు, నాలుగురోజులకంటె ఎక్కువ కాలముండేది కాదు. మరలవెంటనే ఎవరోఒకరు పలకరించే వాండ్లు. తిరిగి ఎప్పటిలాగా బండి సాగిపోతుండేది. కాని ఈ సారి పెద్దబ్రేకు పడ్డది. ఇదివరకు బ్రేకులు పడినపుడు పక్క-యింటి కాంతమ్మవచ్చి మెకానిజంలో తన నైపుణ్యమంతాచూపి ఇద్దరికి రాజీచేసి పోతుండేది. ఈ సారి ఆమె ఆటలేమిసాగ

లేదు. ఎన్నో చెప్పింది కాని ఫలితము సున్న.

ఎంత పెద్ద తగాదావచ్చినా రాము సుశీల వంటిమీదచేయిచేసికొని యెరుగడి దివరకు. అరిచినపుడరిచినా,మరల వెంటనే బజారునుండి రసగుల్లాలు నాలుగు తెచ్చి టేబిలుమీద పడేసేవాడు. రసగుల్లాలంటె సుశీలకు మహాయిష్టము. అంతటితో ఆగి పోయినబండి తిరిగి కదలుతుండేది. ఇపుడో రసగుల్లాలులేవు మీదు మిక్కిలి చేయిచేసు కొన్నాడేమో తెలియదు. సుమారు పది రోజులైనవి ఎడమొగము పెడమొగము తోనె తిరుగుతున్నారు.

ఎవరికంచమువారిది ఎవరిమంచము వారిదైంది. రాము యింట్లో, సుశీల పంచలో పొయ్యిబెట్టినారు. చివరకు నాలుగురోజులు చూచాడురాము. కాని సుశీల పలకలేదు. పొయ్యిపెట్టి వుడకీవుడ కని నానపాలు, నలిగీ నలగని పచ్చడి తయారుచేసికొని తిని ఆఫీసుకు పోతుండే వాడు. వంట అయ్యేవరకు రాము పెద్దపులి వేషము వేసుకొనినవానిలాగా మసి, బూడిద వంటినిండ అయ్యేది. అన్నము పూర్తిఅయ్యేవరకు తలప్రాణము తోకకు వచ్చేది. ఆడవాండ్లదికూడ కష్టమైనపనేనని అప్పుడు తెలిసింది రాముకు. ఇంత అవస్థ పడుతున్నా కాస్త సహాయమైనచేయలేదు సుశీల.

ఊర్లో అమ్మలక్కలంత రాము, సుశీల నుగురించే ఆ పదిరోజులు ఎవరిష్టమొచ్చి నట్లు వాండ్లు మాట్లాడుకొన్నారు. 'పాపము రాము సుశీలకు కీచులాటవచ్చింది. కంచము, మంచము వేరైంది. పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు అంత ప్రేమాగా నున్న అంత విరోధమొస్తది' అన్నది ఒక మొగుణ్ణి వదలిపెట్టిన సుబ్బమ్మ బావిలోకి చేదనువదులుతూ.

ప్రక్కనే వున్న లక్ష్మమ్మ "ఏ తప్పు చేయందీ ఎందుకు పోట్లాటవస్తుంది. ఏదో సుశీల తప్పుచేసివుంటుంది" అన్నది.

"సుశీల గడుసుపిల్ల మొగుడితో పోట్లాడి పదిరోజులనుండి తిండి వండి పెట్టడములేద"ట అని గోవిందమ్మ దొడ్డికెల్లుతూ నారాయ ణమ్మకు చెప్పుతూంది. "అవునులేమ్మ ఆ యబ్బాయి కూడ సరైనవాడుకాదుట ఎప్పుడు తగువులాడుతూంటాడట,కొడుతుం టాడట" అని అన్నది నారాయణమ్మ

"నిజమే అత్తయ్యా చిన్నదానికి పెద్ద దానికి కీచులాటేమిట త్తయ్యా-వాండ్లెప్పుడు తగువులాడుకుంటారు నేను వినలేక చస్తుం టాను" అని అన్నది నాగరత్తమ్మ.

"ఈరోజు తన్నుకుంటారు రేపు బాగుం టారు. ఇంతకు మనమే మధ్య పగ వాండ్లము. మనకెందుకులే వాండ్లగొడవ" అని అన్నది పక్కనకూచొనిన చెంచమ్మ.

సుశీలకు కడుపులో భయముపడ్డది. నలు గురునానావిధాలుగ అనుకోటమువిన్నది. సుశీల మనసుగాలిలో తెగిన గాలిపటము

లాగా కలత జెందినది. తుదకు సుశీలకు విసుగు పుట్టి అమ్మగారింటికి వెళ్లుదామనుకొని కాంతమ్మచేత చెప్పించింది భర్తకు. వెళ్లమన్నాడే కాని వుండమనలేదు. వెళ్లమన్నాడని సుశీలకు మరింత కోపము, కోపానికితోడు దిగులు పుట్టుకొచ్చింది. తన సంసారము చీకాకు అవుతుందేమోనని, అమ్మగారింటికి పోతే మరల తీసుకరాడేమోననీ భయపడింది. వాండ్లు మాత్రమెన్నిరోజులు సాకగలరు. ఎప్పటికైన తాలికట్టిన భర్తే పోషించాలిగాని ఇతరులెందుకు పోషిస్తారనుకొంది. ఇన్ని ఆలోచనలు చేస్తున్న ఆ బుర్ర భర్తను ముందుగ పలుకరించి మంచిచేసికొని, ఎప్పటిలాగున చిలక గోరింకల్లాగా వుండకూడదా? ముందుగ పలకరించటానికి ఒప్పుకొనే సుశీలకాదు. సుశీల ఆత్మాభిమానముగలది. అట్లాగె చిన్నప్పటినుండి పెరిగింది తల్లిదండ్రుల చేతుల్లో. ఇప్పుడు కూడ అట్లుంటె కుదురుతుందా? తల్లిదండ్రులంటె ఒప్పుకున్నారు. భర్తెందుకొప్పుకుంటాడు. ఒప్పుకోడు. అందువలన సమయానుకూలముగ మనస్సును కట్టుబాటు చేసికొని భర్తకు విధేయతగా మెలగుతూ, పడవను ఋజుమార్గములో నడిపించాలి, లేనిచో ఇద్దరికి ప్రమాదమే.

"వాండ్ల వ్యవహారము స్రుతిమించిరాగాన పడేటట్లున్న"దని ప్రక్కింటి కాంతమ్మ, సుశీల తండ్రికి జాబువ్రాసింది వారికి తెలియకుండ. "మీఅల్లుడు, కూతురు పోట్లాడుకొని, కంచము, మంచము వేరేపెట్టుకొన్నారు. నా మాట వినలేదు, ఆలస్యము చేస్తే తీవ్రరూపము దాల్చును. నీవు వచ్చి సరిపెట్టిపోవాలెను. అర్జంటుగా రావలె"నని.

వెంటనే సుశీలతండ్రి బయలుదేరి వచ్చినాడు కాని సుశీల రాము ఇంటిలోలేరు. తలుపుకు తాళము వేసివుంది. ఆశ్చర్యపోయాడు. ప్రక్కింటి కాంతమ్మను అడిగినాడు. "నాకు తెలియదన్నది ఎక్కడికైన వెళ్లారెమో వస్తారు అప్పటివరకు తనింటిలో వుండమనింది." కాని సుశీల తండ్రికి మనసునిలువలేదు వాండ్లకెందుకొచ్చిందో ఆ కీచులాట అని అడిగాడు.

ఒకరోజు రాత్రి "ఏమండీ నాకు అమ్మాయి పుట్టాలని కోరుకున్నది. పుట్టితే ఏమిపేరు పెడదామండి" అని అడిగిందట మీ కూతురు "ఛీ. పాడు అమ్మాయి-వాండ్లను సాకలేకచావాలి. అబ్బాయి పుట్టితే బాగుంటుంది. మనకక్కరకు వస్తాడు ఆడపిల్లలెంత సాకిన మన యింట్లో వుండేవాండ్లుకాదు. పైగా కట్నాలు, కానుకలు మన మీరోజులలో తీసుకరాలేము. అబ్బాయి అయితే వాడే చదువుకొని, పెద్దవాడై, ఏదో ఒక ఉద్యోగము చేసుకొని బ్రతుకుతాడు. వాడితో దిగులుండదు. ఆడపిల్లలుంటే

దిగులుతో చావాలి. నీవు లేనిపోని కోరి కలు కోరుతుంటావు'' అని రాము అన్నా డట. ''నాకమ్మాయే కావాలి. నేను పాడు పనంత చేసుకోలేకున్నాను. కాలికి చేతికి అడ్డమువస్తది, అమ్మాయి కావాలి'' అని సుశీల గట్టిగ అన్నదట. ''నేనవిన దానికి కాదంటావా'' అనిరాముకు కోపము వచ్చిందట.''అమ్మాయి పుట్టితే తనయింటికి రావద్దన్నాడట.'' ''నీ యిష్టమేనా? నాకు కూడ యింటిలో అధికారమున్నది.'' అని సుశీలన్నదట. ''మీనాన్న సొమ్మిక్కడ లేదు. ఇది నాహక్కు మానాన్న సంపాదిం చిన''దనిరాము అన్నాడట. సుశీల పూరు కోనేమనిషి కాదు మాటమీద మాట అనే సింది. రాముకు కోపమువచ్చి చెయి చేసి కొన్నాడు. ఇది జరిగినతగాదా'' అని కాంతమ్మ చెప్పేసరికి సుశీల తండ్రి వాండ్లను పిచ్చివాండ్లకు క్రింద లెక్క వేసు కొన్నారు. దేవుడు కలుగచేసేదానికి ముందుగ తగవులాడుకొని వేరుపోయినం దుకు వాండ్లపిచ్చి చేష్టలను గురించి ఆశ్చర్య పోయాడు. తగవులాడుకొని ఎటు అయిన పోయినా రేమోనని, ఎక్కడయిన పడ్డారేమోనని భయపడ్డాడు.

ఇంతలోనె రాము, సుశీల ముస్తాబై ఒక రిక్షాలోనె కూర్చొని సినిమాకు వెళ్లి వస్తున్నారు. కాంతమ్మ చూచి ఆశ్చర్య పోయింది. వాండ్లిద్దరిని వింతమనుషులను కొంది.. సుశీల తండ్రికి మీ అల్లుడు కూతురొచ్చినారని చెప్పింది. సుశీల తండ్రి గుండెదడలు తగ్గినవి. సుశీల తండ్రికి ముందుగా అన్నము పెట్టింది సంతోష ముతో. తిన్నతరువాత జరిగిన కాశీమజిలీ కథ చెప్పటానికి సుశీల సిగ్గుపడ్డది. ''నీవు చెప్పక పోయినా నాకు ముందుగానే తెలిసినదిలే.'' అన్నాడు సుశీల తండ్రి.

కాంతమ్మ వచ్చి ''ఏమటమ్మాయి నేనెంత చెప్పిన మీరు నా మాటవినలేదు. ఎట్లారాజీ పడ్డారు'' అని అడిగింది. సుశీల ''కల మేలుచేసిందవ్వా'' అని అన్నది. ''ఏమికల, ఏమిజరిగిందమ్మాయి'' అని కాంతమ్మ వింతగా అడిగింది.

''ఒక పెద్దదెయ్యమో, రాక్షసుడో, తాటి చెట్టంతఎత్తు, నలుగురి మనుషుల లావు, నల్లగావచ్చి మీ మనుమడిమీద కూర్చొని, గుండెలమీద గుద్దుచున్నాడట ఊపిరాడక పెద్దగ అరిచాడు. నేను ప్రక్క మంచముమీద పండుకున్నాను కదూ? ఆ కేకవిని భయపడి, దొంగలనుకొని, వెర్రికేకవేసి ఆయన మీదపడ్డాను. ఆయన ఉలిక్కిపడిలేచి, నన్ను బుజ్జగించి, భయము మాన్పి, దగ్గఱకు తీసికొని హత్తుకున్నారు. ఆభయముతో మరల నామంచముమీదికి పోలేదు. ఒకే మంచము, ఒకే కంచం'' మన్నది. ''మీరు బాగుంటే అదే పది వేలన్నది. '' కాంతమ్మ. సుశీల తండ్రి మూడోనాడు రైలు ఎక్కాడు.

# మీనా

కుమారిశిరిపురపు జిజియ



మీనా నృత్యం చేస్తూంటే ఆ ముఖ భంగిమలనూ, శరీరపు వొంపు సొంపులను, కదిలే ఆవక్షోజాలను తనివితీరా చూచి ఆనందిస్తున్నాడు కామేశం. నృత్యాన్ని చూడటానికివచ్చిన వాళ్ళందరూ ఆ విధం గానే ఆనందిస్తున్నారు. వారిలో రంగారావు, భీమారావు, ఆనందరావుకూడా వున్నారు. అందరూ తన్మయులై నృత్యాన్ని తిలకిస్తున్నారు. మీనా కాళ్ళగజ్జెల చప్పుడు వాళ్ళందరి హృదయాల్లోనూ ప్రతిధ్వనిస్తోంది. కొంతసేపటికి ప్రతిధ్వని మాయ మయింది. అందరూ ఒక్కసారిగా తలలెత్తిచూశారు. ఎవరో ఆగంతకుడా మందిరంలో ప్రవేశించటం చూశారు. అతని గడ్డం మాసివుంది. జుట్టు జడలు కట్టివుంది. నేత్రాలు జ్యోతుల్లా ప్రకాశిస్తున్నయి. అతనువచ్చి కవాటం దగ్గరే ఆగి నృత్యంమాని నిల బడివున్న మీనావైపు చూస్తున్నాడు. అతణ్ణి చూడ గానే కామేశానికి చెడ్డకోపం వచ్చింది. మిగతా వాళ్ళకుకూడ చాలా చిరాకు కలిగింది. కామేశం ఆలస్యాన్ని సహించలేక "అడుక్కొనే వాళ్లు వచ్చే ప్రదేశం కాదిది. పోరా! పుండాకోర్" అని చెవులు గళ్లు పడేటట్లు ఒకపెద్ద కేకవేశాడు. అతడలా చలించక చూస్తున్నాడు మీనా వైపు. మీనా ఆ కేకవిని ఉలిక్కిపడింది. ఆగంతుకుని బయటికి గెంట టానికి అందరూ లేచారు. మీనా నవ్వుతూ వారిని వారించి "అంత ఆవేశం దేనికి మీకు! మీలానే

అతనూ వచ్చాడు. డబ్బులేక పోయినందువల్ల అనందించటానికి రావటం తప్పా? అతనూ మీలాంటి మనిషే. మీలాగే అతనూ ఆనందిస్తాడు." అని ఆగంతకుని ఆహ్వానించింది చిరునవ్వుతో. అందుకు వారందరూ ముక్కుమీద వేలేసుకున్నారు. మరల నృత్యం ప్రారంభమయింది. ఏమీజరుగనట్లే మళ్లా నృత్యాన్ని తిలకించడంలో నిమగ్నులయ్యారందరూ. కొంత సేపటికి నృత్యం అయిపోయింది. అందరూ మీనాని "నీ అంతమేటి నాట్యకత్తె లేదని, నీ అంత అందగత్తె దేవలోకంలోకూడా వుండదని" ఎవరికి తోచినట్లు వారు అభినందించి వెళ్లిపోయారు. కాని ఆగంతకుడు మాత్రం ఉండిపోయాడు. మీనా నెమ్మదిగా వచ్చి అతని దగ్గరగా కూర్చొంది. అతని ముఖం ప్రశాంతంగా వుంది. మీన "మీరెవరు? మీరేమీ అనుకోకుండా వుంటే ఒక విషయం అడగాలని వుంది"

"మీనా... క్షమించు. ఇలా సంబోధించినందుకు నన్ను నీవు గుర్తుపట్టలేదనుకుంటాను. చిన్నప్పుడు — అంటే పదేళ్ల నాటిమాట. మన కుటుంబాలు ఇరుగూ పొరుగూను. అందువల్ల నీవు, నేను చాలా చనువుగా వుండేవాళ్లం. నీకింకా జ్ఞాపకం రావటంలేదూ? ఒక సారి మనమిద్దరు కాలవగట్టుకి షికారుకి వెళ్లితే నీవు కాలుజారి నీళ్లల్లో పడిపోయావు. జ్ఞాపకముందా?"

"దీనా, నీవేనా అబ్బ! ఎన్ని రోజులకు కనిపించావు? ఎంతమారిపోయావు. ఆ గడ్డమేమిటి; ఈ అవతారమేమిటి? ఏమిచేస్తున్నావిప్పుడు? ఇంట్లో అందరూ కులాసాయేనా?"

"హు! కులాసా. మీనా! నాస్థితి చూచిన ప్రతివాళ్లూ చెప్పకుండానే నన్ను తెలుసుకుంటారు. అమ్మ నా చిన్నప్పుడే పోయిందిగా. ఇక నాన్నగారు జబ్బుపడి తీసుకొని రెండేళ్లక్రితమే పోయారు. ఇక నా అన్న వాళ్లెవరూ లేరు నాకు. బి. ఎ. వరకు చదివానుగా - ఏదో చిన్న వుద్యోగం దొరికింది ఆ మధ్య. అప్పుడు హాయిగా జరిగిపోయేది కాలం. ఇప్పుడు అదికూడాలేదు. భోజనం చేసి ఇప్పటికి 3 రోజులయిందంటే నమ్ముతావో లేదో"

"అరే! నిజమా దీనా. లే. ముందు భోజనం చేద్దువుగాని. ఎంత ఆకలితో వున్నావో" అంటూ దీనదయాళ్‌ని మీనా లోపలికి తీసుకొని వెళ్లి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం వడ్డించి - అతను తింటూంటే ప్రక్కన కూర్చొని తృప్తిగా అతనివైపు చూస్తోంది. దీనా ఎంత మారిపోయాడు! అనుకొంది లోపల. దీనా భోజనంచేస్తూ మధ్యలో మీనా వైపు చూచి అడిగాడు - "అయితే మీనా! మీ అవ్వ కులాసాయేనా? ఆరోజున పట్నం వెళ్లి మీనకి నాట్యం నేర్పించాలి. అచ్చట బాగా చెప్పేవాళ్లుంటారట. అది నాట్యం అంటే పడిచచ్చిపోతుంది, అని నాన్నతో చెప్పుతున్నప్పుడు చూచాను మీ అవ్వను. మనం ఒకళ్లనొకళ్లం విడిచిపెట్టలేక కళ్లనీళ్లతో వీడ్కోలిచ్చుకున్నాం జ్ఞాపకం వుందా?"

"అన్నీ జ్ఞాపకం వున్నాయ్ దీన్. మా అవ్వ కాశీ చూడాలంటే దానితో నేనూ వెళ్లాను ఈ మధ్య. అక్కడే కలరాతగిలి ఆమె పోయింది. ఇప్పుడు నేను ఒంటరిదాన్ని. దాసీలకు మాత్రం తక్కువలేదు. నేను నేర్చుకున్న విద్యతోనే కాలక్షేపం చేస్తున్నా. నీవుకూడా నాతోనే వుండిపోకూడదూ?"

"పనీ పాటా లేకుండా వూరికే ఎలా కూర్చొమన్నావు? ఏదయినా వుద్యోగం కోసరం ప్రయత్నం చేస్తా"

ఇంతలోకి భోజనం చేయటం పూర్తి అయింది.

♦ ♦ ♦

మరునాడు నాట్యం వేళకు అందరూ హాజరయ్యారు. మామూలు వేళకే మీనా నృత్యం ప్రారంభమయింది. ఇదివరకుకంటే చాలా వుత్సాహంగా తన్మయతతో నాట్యం చేస్తోంది మీనా. రోజూలాగే గజ్జెలచప్పుడు అందరి హృదయాల్లోనూ ప్రతిధ్వనిస్తోంది. నిన్నటిలా ప్రతిధ్వని ఒక్కసారిగా ఆగిపోయింది. అందరూ తలెత్తి చూచారు గుమ్మంవైపుకు. ఎవరో ఆగంతకుడు నిన్నటిలాగే గుమ్మందగ్గర నిలబడ్డాడు మీనా వైపు చూస్తూ. మీనా చిరునవ్వు

దొంతర్లు దొర్లిస్తూ నిలబడింది. అందరికీ అతను అపరిచితుడుగా కనపడ్డా మీనాకు పరిచయుడే. అందరూ కామేశం, రంగారావులతో సహా నిలబడ్డారు. ఈ సారి నిన్నటి మాదిరిగా గెంటటానికి కాదు నిలబడింది. ఈ వ్యక్తికీ నిన్నటివ్యక్తికీ వాళ్లకు హస్తిమశకాంతరం తేడా కనిపించింది. ఈవ్యక్తి ట్వీడ్ సూట్‌లో నున్నాడు. మెడకు టైవుంది. కాళ్లకు బూటు, తలకి హేటూ వున్నాయి. చాలాఠీవిగా నున్నాడు మనిషి. ఆకళ్లు.. ఆకళ్లు మాత్రం నిన్నటి వ్యక్తియొక్క నేత్రద్వయంలాగే ప్రకాశిస్తున్నాయి. అందరూ ఆగంతకునికి నమస్కరించి ఆహ్వానించారు. అతనికొరకొక సోఫా ప్రత్యేకించబడింది. అతను ఠీవిగా ఆ సోఫాలో కూర్చొంటే పరిచయం కోసరం అందరూ తంటాలు పడుతున్నారు. వాళ్ల అవస్త చూచి మీనా పక్కున నవ్వింది. ఆ నవ్వులోని అంతరార్థం తెలియక ఆగంతకుడు తప్ప మిగతా వారందరూ తికమక పడ్డారు. అప్పుడు మీనా ఆగంతుకుని పరిచయం చేసింది.

“ఈయన పేరు మిస్టర్ దీనిదయాళ్”

అందరూ మరొక్కమారు నమస్కారం చేశారు. మళ్లా మీనా చెప్పటం మొదలు పెట్టింది.

“ఈయన చాలా ధనవంతుడని ... ...

“ఆ విషయం మీరు చెప్పకుండానే తెలుసుకున్నాం. వారిని చూస్తేనే తెలుస్తోంది జమిందారీ బిడ్డని.”

“అవును ఆయనను ఈక్షణంలో చూస్తే మీరందరూ అలా అనుకోవటంలో ఆశ్చర్యమేమీలేదు. నిన్నవచ్చినవ్యక్తి మీకు జ్ఞాపకం వున్నాడా?”

“ఎవరూ? ఆ బికారీ వెధవా?!”

“ఆ...ఆ...ఆయనే ఈయన. ఎందుకూ అంత ఆశ్చర్య పడతారు? అవును - ఎందుకు ఆశ్చర్య పడరూ! డబ్బులోనే వుంది విలువంతా. అయినా ఇప్పుడొక విషయం ముఖ్యంగా మీకు చెప్పవలసి వుంది. మేమిద్దరూ చిన్ననాటి స్నేహితులం. విధి అతని నలా చేశాడు. కాని ఇప్పటికి అదృష్టం వరించింది. ఆయన ప్రస్తుతం ఒకపెద్ద ఉద్యోగి_నాకు కాబోయే భర్త. ఇకనుండి నేను నాట్యం చేయడం మానివేస్తున్నానని చెప్పటానికి చింతిస్తున్నా. ఇన్ని రోజులయి నానాట్యాన్ని చూసి గౌరవించి నన్నభినందించినందు కెంతయో కృతజ్ఞురాలను. ఇక సెలవు”

నిన్నటిబికారే ఈ వేళ మీనాకు కాబోయే భర్త అని వింటూంటే అందరూ ఈర్ష్యతో కుళ్లి పోయారు. వాళ్లందరికీ పట్టని అదృష్టం అతన్ని వరించినందుకు శాశ్వతంగా మీనాదగ్గర సెలవు తీసుకొని బరువెక్కన హృదయాలతో బయట పడ్డారందరూ.

---

ఒకబాలుడు కొట్టబోతున్న తండ్రితో “నాన్నా! మీరు చిన్నవారుగానున్నప్పుడు తాతగారు మిమ్ముల్ను కొట్టేవారేనా”

“అవును”

“తాతగారిని ఆయన చిన్నతనంలో ముత్తాతకూడ కొడ్తుండేవారే కదూ”

“అవును”

“ముత్తాతను వాళ్లనాన్నకూడ పాపం! కొట్టేవారు కాబోలు”

“అవును”

“అయితే యిప్పుడైనా మీరు నా సహాయంతో వంశపారంపర్యంగా వస్తున్న ఈదురుమాతుతనాన్ని అరికట్టకలుగకూడదూ!”

# బాధ్యతా నిర్వహణ

శ్రీ చక్రవర్తి రంగస్వామి

స్త్రీకి గృహయజమానురాలుగా ఎన్నో బాధ్యతలున్నయ్. ముఖ్యంగా పత్నిగా, మాతగా తన పవిత్ర బాధ్యతలను నిర్వహించవలెనంటే ఎంతో విజ్ఞానమూ, సంస్కారమూ, సహనమూ, ప్రేమా, సమయస్ఫూర్తీ చాల అవసరం. సహనాన్ని, ప్రేమనూ ఎంతగా అలవర్చుకొన్నప్పటికీ మూఢవిశ్వాసాలనూ, అజ్ఞానాన్నీ వదిలించుకోలేని యడల స్త్రీ తనకు తెలియకుండానే తనకు ప్రేమపాత్రులైన సంతానానికీ, భర్తకూ అపకారాన్ని కలుగజేసి తన దుఃఖానికి తానే కారణం ఔతుంది.

కేవలం దైవభక్తీ, పతిభక్తీ మనకు నిత్యమూ తటస్థపడే అనేకగండాలను దాటింపలేవుగదా! ముఖ్యంగా విద్యావతులైన స్త్రీలు మూఢ విశ్వాసాలకూ, అజ్ఞానానికీ, ఇతరులు తెచ్చి పెట్టే ఒత్తిడికీ లొంగిపోకూడదు. తన భర్త, సంతానమూ, కుటుంబములోని ఇతర సభ్యులు కూడా వీనికి లొంగి పోకుండా ఉండేటట్లు వేయి కండ్లతో కని పెట్టి ఉండవలసిన బాధ్యత ఆమె మీద ఉన్నది.

ప్రతికుటుంబములోనూ ప్రబలులైన వ్యక్తులు కొందరుండటం మామూలు. అలాంటి వారి ఆజ్ఞలు కారణంగా అనేక తీరని నష్టాలు కుటుంబానికి కలుగుతూ ఉండటం అందరికీ తెలిసినవిషయమే. ఎలాంటి కష్టనష్టాలు కలిగినప్పటికీ అలాంటి వారు ఇతరుల మంచి సలహాలను తమ మస్తిష్కంలోకి చొరనివ్వరు. కారణం - తమమాట సాగి పోవలసిందే. అట్టి క్లిష్టపరిస్థితులలో విజ్ఞానవతియైన స్త్రీ తన సమయస్ఫూర్తితోనూ, సహనభావంతోనూ, కలుగజేసుకొని శుభాంతంగా వ్యవహరించగలదు. సమయస్ఫూర్తిగల విజ్ఞానవతి కలుగజేసుకొనని యడల ఇలాంటి సమయాలలో పురుషుడు ఉద్రేకాన్ని పొంది సహనాన్ని పోగొట్టుకొని దుష్ఫలితాలను నెత్తి మీదికి తెచ్చి పెట్టుకోగలడు.

బాల్యంనుండీకూడా పురుషునికి అనేక దురభ్యాసాలూ, దుర్వ్యసనాలు అందుబాటులో ఉంటయ్. పెద్దయై పెరిగిన తర్వాత బ్రతకటంకోసం పోరాడుతున్నట్లు భావిస్తాడు. అతని హృదయం దైన్యంతో, ఉద్రేకంతో నిండి ఉంటుంది; లేదా

అహంభావంతో అత్యాశతో ఊగుతూ ఉంటుంది. ప్రేమా, ఔదార్యమూ, శౌర్యమూ నీతీ లాంటి సుగుణాలు అప్పుడప్పుడూ ప్రాముఖ్యంగా కనపడ్డప్పటికీ ఎల్లప్పుడూ నిలకడగా కనపడవు. వానికొరకు సాధనచేసే వారు బహుస్వల్ప సంఖ్యలో ఉంటారు. అందువల్లనే పురుషుడు తన కుటుంబానికి చేయగలిగింది చాల స్వల్పం-సంపాదించడం మాత్రమే. ఈ సంపాదన మూలంగానే ఆతనికి ఇంట్లో ఎంతో దౌర్జన్యంగా ప్రవర్తించటానికి వీలు పడ్డది. తిట్టటం, కొట్టటం, ఇంట్లోనుండి వెళ్లగొట్టటం ఇలాంటి దౌర్జన్యాలను విద్యావంతులైన పురుషుల్లోనే అనేకమంది చెయ్యడాన్ని మనం చూస్తూన్నాము. అంటే విద్యతో పాటు నీతినీ, సహనాన్నీ నేర్చుకోవటానికి వీరు ప్రయత్నం చెయ్యటం లేదన్నమాట.

స్త్రీ కూడా అలాంటి తప్పునే చెయ్యకూడదు. స్త్రీకి సహజంగా ఉండే సహనమూ, ప్రేమా, సమయస్ఫూర్తితో పాటు విద్యద్వారా విజ్ఞానాన్నీ, సంస్కారదృష్టినీ అలవర్చుకుంటేచాలు; తన సంసారాన్ని ఆనంద నిలయంగా చేయగలదు.

నిజానికి ఉదయమునుండి అర్థరాత్రి వరకు ఇల్లాలుచేసే శ్రమ, వేతనం కొరకు భర్త చేసే శ్రమకంటే ఎంతమాత్రము తక్కువ కాదు. పిల్లల ఆరోగ్యం, విద్య కొరకు-భర్తవిశ్రాంతి, ఆనందం, ఆరోగ్యం కొరకు ఆమె తీసుకొనే శ్రద్ధకు విలువకట్ట గలమూ?

కాలంతో పాటు అనేక మార్పులొచ్చాయి. పురుషునితో పాటు స్త్రీకి విద్యావకాశాలు ఏర్పడ్డాయి. పురుషునికి వలెనే స్త్రీకి ఉద్యోగావకాశాలు ఏర్పడుతున్నాయి. సంపాదింప కలుగుతున్నది

మధురమైన తన పత్నీత్వానికీ, పవిత్రమైన మాతృత్వానికీ వన్నె తెచ్చే విధంగా స్త్రీ, విద్యను ఉపయోగించుకొన గలిగినప్పుడే, సద్గుణాలను పెంపొందించుకొన గలిగినప్పుడే, స్త్రీ స్వాతంత్ర్యం వల్ల పవిత్ర భారత దేశంయొక్క యశస్సు వృద్ధి పొందగలదు.






అలంకరణసంబరం






## బూడెద గుమ్మడికాయ మురబ్బ

బూడెదగుమ్మడినే తెల్ల గుమ్మడి అనికూడా అంటాము. ఇది వంటికి చాలా మంచిది. దీనితో ఎన్ని రకాలయిన పదార్ధాలయినా చేసుకోవచ్చును. మురబ్బా చేయడానికి, $\frac{1}{4}$ వీశె గుమ్మడి చెక్క ను తీసుకొని, తోలు తీసి, పులుసు ముక్కలు మోస్తరుగా పెద్దపెద్ద ముక్కలు తరిగి, తెల్లటి వస్త్రిముమీద ఆరబెట్టాలి. ఒక కళాయి పాత్రలో 10 పలాల చక్కెర, $\frac{1}{4}$ అళాను నీళ్లు పోసి బాగా పాకం అయ్యేవరకూ వుడక నియ్యాలి. పాకు తయారుకాగానే, ఈ ఆరబెట్టినముక్కలు అజీరాలో పడెయ్యాలి. ఓ అరగంట సేపు చక్కగా కలియబెట్టుతూ వుడికిన తరువాత ఆ ముక్కలు చిన్నగా రబ్బర్ వలె అవుతాయి. అప్పుడు $\frac{1}{4}$ తులం కుంకుమ పువ్వు తీసుకొని రెండుచెంచాల పాలు పోసి మెత్తగా నూరి, ఆ వుడికే పాకంలో పోయాలి. మంచి సువాసన వచ్చేవరకూ వుడకనిచ్చి కాస్త ఏలకుల పొడి చల్లి దించెయ్యాలి. దీన్ని జాగ్రత్తగా నిలువచేసికొంటే గోధుమ రొట్టెలు, Bread, పూరీలు మొదలగు వానితో నంజుకొని తినేందుకు చాలా రుచిగా నుంటుంది. ఇది దేహానికి చాలా పుష్టికరము. ఇదే మాదిరి దోరమామిడిపండ్లతో కూడా చేసుకోవచ్చును.

## ఉసిరికాయల మురబ్బా

పెద్ద ఉసిరికాయలనే, నెల్లికాయలనికూడా అంటారు. పెద్ద ఉసిరికాయలు పాతిక తీసుకొచ్చి, మూడు రోజులపాటు నీళ్ళలో నానెయ్యాలి. తరువాత వీటిని బయటికి తీసి, దబ్బనముతో గంట్లు పెట్టాలి. మళ్ళా వాటిని సున్నపు తేట నీటిలో రెండు రోజులు వుంచాలి. రెండురోజులు అవగానే వాటిని తీసి, నీళ్ళతో కడిగి మంచి నీళ్లతో వుడక బెట్టాలి. పాతికకాయలకు శేరు పంచదార తీసుకొని, అందులో మూడవ వంతున నీరుపోసి, పాకంపట్టాలి. పాకం $1\frac{1}{2}$ అంగుళము, తీగ, సాగేవరకుతీసి, దింపిన తరువాత అందులో ఈ వుడికించిన ఉసిరికాయలను పోయాలి. దానిలో కేసరి అరకు గాని, కుంకుమ పువ్వుగాని కొద్దిగా కలుపుకోవచ్చును. ఇది దేహమునకు చాలా ఆరోగ్యకరమైనది, పుష్టికరమైనది.

## తియ్య గుమ్మడికాయ బరిఫి

తియ్యగుమ్మడికాయనే మనం, మంచిగుమ్మడికాయ, ఎఱ్ఱగుమ్మడికాయ అనికూడా అంటాము. దీనితోకూడా చాలా రకములైన వస్తువులు తయారు చేయవచ్చును. 10 పలముల తియ్యగుమ్మడి తెచ్చి, కొబ్బరి కోరు మోస్తరు కోరి, నీరు వడియునట్లు బాగా పిండి వుంచుకోవాలి. బాణట్లో కొంచెం నెయ్యి పోసి, కాగినతరువాత ఈ పిండివుంచిన కోరును అందులో వేసి బాగా కమ్మటి వాసన వచ్చేదాకా వేయించి వుంచుకోవాలి. ఒకకళాయి పాత్ర తీసుకొని, అందులో 10 పలముల చక్కెర, $\frac{1}{4}$ అళాకు నీళ్లు పోసి పాకం పట్టాలి. పాకం బాగా తయారుకాగానే ఈ వేయించియుంచిన గుమ్మడికోరు, 2 తులముల పిస్తాపప్పు, 2 తులముల సారపప్పు, కాస్త ఏలకులపొడి, కొంచెము కుంకుమపువ్వు వేసి బాగా కలియబెట్టి, 10 నిమిషములు సన్నపు సెగమీద వుంచాలి. ఒక కళాయి పళ్లెమునకు కొంచెము నెయ్యిరాసి అందులో ఈ తయారు అయిన గుమ్మడి బరిఫిని పోసి గరిటెతో చక్కగా సర్దాలి. కొంత సేపటికల్లా అది ఆరి కొంచెము గట్టి పడుతుంది. దానిని చాకుతో మనకు కావలసిన రూపులో కోసి వాడుకోవచ్చును. ఇవి చాలారుచిగా వుంటాయి.

యం. సుశీల

# వింత్ర సంఘము

శ్రీ ఎస్. వెంకటరమణ

అప్పుడే రైలుకూత వినిపించింది. తన మొదటి గ్రంథాన్ని అచ్చుచేయిస్తామని Publisher అప్పుడప్పుడే కవిత్వము మొదలు పెట్టిన కవికి ఎంత వుత్సాహమిస్తుందో అంతకు వెయ్యిరెట్లుగా వుత్సాహము కనబడింది తోడి ప్రయాణీకుల మొఖాల్లో. అప్పటికే 1 గం॥ పడివుంది రైలు అక్కడ. మృత్యుముఖము వాతపడ్డ మానవునికి కనిపించిన ఆశలా అనిపించింది ఆ రైలు కూత ప్రయాణీకులకు. ఆ స్టేషన్‌లోనే సుమారు 20 సం॥ స్త్రీ ఎక్కింది మా పెట్టిలో. ఆమె ముఖములో నిరాశ జ్యోతి తాండవిస్తున్నది.అంత చిన్నవయస్సులోనే ఎన్నో కష్టాలు అనుభవించినట్లుంది. ప్లాట్‌ఫారమ్‌మీద ఇంకా ఎవరెవరో వారి బంధువులు వచ్చినట్లుంది. ఆ గంటసేపు ఆమెతో మాట్లాడి ఎంతగనో విలపిస్తున్నారు. బండి కదులుతూవుండగా "అమ్మా జాగ్రత్త" అని ఎంతో విలపిస్తూ చెప్పారు. బండి సాగిపోతూవున్నది కాని ఆమె ఇంకా ఏడుస్తూవున్నది. ఆ కంపార్ట్ మెంట్‌లో వున్న ముసలి డాక్టరు "ఏమమ్మా అలా విచారిస్తున్నారు" అన్నాడు. "మా అత్త గారింటికి పోతున్నానండి" అంది. "దాని కింతగా విచారించవలెనా? ప్రతి స్త్రీ భారత దేశములో పుట్టే అత్తవారిల్లేకదా నివాస స్థలము" అన్నాడు తాకికంగా ముసలి డాక్టరు. నాకు చుర్రున మండింది. మన తోటి జీవి అలాంటి దుఃఖస్థితిలో వుంటే అలాగేనా ఓదార్చేది. వెంటనే ఆమె "మీకు ఏమి తెలుస్తుంది! క్షమించండి మీకు పుత్రికలు లేరేమో – వున్న మీరంతగా పట్టించుకోరేమో. కాని నావిషయము అది కాదు" అంటుండగా పేపర్లు చదువుకుండేవాళ్ళు, పత్రికలు చదువుకుంటే వాళ్ళు, పరధ్యానముగా వుండేవాళ్ళంతా ఆతురతగా వినడము మొదలు పెట్టారు. ఆమె ఇలా చెప్పడము మొదలుపెట్టింది. "మా తల్లి తండ్రులకు నేను ఒక్కర్తనే కుమార్తెను. మా తల్లిదండ్రులు నేను పుట్టకముందు చెట్టుకు గుట్టకు మొక్కుకున్నారు. నన్నెంతో అల్లారు ముద్దుగా పెంచుకొన్నారు. పదమూడో సంవత్సరము నుంచి పెండ్లి ప్రయత్నాలు చేశారు. మేము వ్యవసాయము చేసుకొంటూ ఆనందంగా వెళ్ళబుచ్చేవాళ్ళం. కాని అలా ఎప్పుడూ జరుగుతుందా చెప్పండి తాతగారు. పదిహేనోయేట నాకు వివాహమయింది. అనుకున్న ప్రకారము నన్నువిడచి వుండలేక మా తల్లితండ్రులు అల్లుణ్ణి ఇంట్లోనే వుంచుకొన్నారు. మా ఇద్దరినీ చూచుకొని ఎంతగనో ఆనందించారు. కాని ఆ ఆనందము

**ఎంతో** కాలము నిలువలేదు. వాళ్ళ ఊళ్ళో వుండాలని రెండు సంవత్సరాలు తిరిగేలోగా **వాళ్ళ** ఇంటికి వెళ్ళిపోయారు. మా తండ్రి వాళ్ళ కాళ్ళు గడ్డాలు పట్టుకొని బతిమిలాడారు. కాని లాభములేకపోయింది. కాబట్టి నన్ను పంపించడానికి సిద్ధపడ్డారు. కాని ఆ ఆలోచనతోనే మా తల్లి మంచము ఎక్కింది. నాకు ఏమిచేయడానికి తోచలేదు. ప్రాణానికి ప్రాణమివ్వడానికి సిద్ధమయ్యేట్టి తన జీవితము యొక్క సర్వము నేనని తలచుకొన్న మా తల్లిని వదలి పోవడమా వద్దా ? అన్ని విధాలుగా ఆలోచించాను. ప్రపంచములో ఎంతమంది స్త్రీలు అత్తవారింటికి పోవడములేదు. వారి తోబుట్టువులను స్నేహితులను ఎంతో ఆనందాన్ని హాయిని కలిపించె ఎన్నో వస్తువులను వాళ్ళ గ్రామములో వదలి ఎక్కడ ఎక్కడకో వెళ్ళిపోతారే వాళ్ళమాట ఎవరన్నా అనుకొన్నారా. నిజంగా ఎంత స్వార్థపరులు మానవులు! ఆస్తి కోసము ధనముకోసము వివాహము చేసుకోడము ఎంత అవినీతికరము! ఎంత అన్యాయము! ” నాకు పిచ్చి ఎత్తినట్లు అయింది ఆ మాటలు వింటుంటే. ఇవన్నీ మనము రోజుచూచే విషయాలే వినేవిషయాలేకదా ? పైగా ఎవరయినా స్త్రీ స్వాతంత్ర్యమంటూ మాట్లాడితే 'బయలు దేరారు పెద్ద సంస్కర్తలు' అంటారు, శాస్త్ర సంబంధమైన 20 వ శతాబ్దములోని నవీనయువకులు. ఆమె ఇలా చెప్పడము ప్రారంభించింది. “ స్త్రీ స్వాతంత్రమంటూ ఉపన్యాసాలు ఇస్తూ పత్రికలకు వ్యాసాలు వ్రాసిన వారిలో ఒకరు మావారు. కాని ఏమిలాభము 'ఇంటగెల్చి రచ్చగెలువు' అన్నట్లు వారి విషయాల్లోనే వారి సిద్ధాంతములను అమలులోబెట్టుకోలేక ఏమిచేస్తే మట్టుకు రాణిస్తుంది. నాకు ఎంత భాద్యతో? వారికి అంతేకదా ? పైగా మేము ప్రాధేయపడ్డా జవాబు చెప్పలేదు. ఎందుకా B. A. చదువులు? అలాగే ఈ రెండు సంవత్సరాలు మా కుటుంబములో ఎన్నో కలతలు బయలుదేరాయి. ఆనందము మాయమయింది. ఈ భారత దేశములో అందరి స్త్రీలలాగే అత్తవారింటికి పంపించడానికి నిశ్చయించుకొన్నారు మా వాళ్లు. మా తండ్రి ఎన్నో మారులు మా అత్తగారింటికి పోయినారు. ఎంత ఆడపిల్ల తండ్రి అయినా సంస్కారము తెలిసి సంఘములో వుంటే ప్రతి మానవుడు తోడి మానవుణ్ని ప్రేమించడము గౌరవించడము నేర్చుకోవద్దూ ? కాని మా తండ్రిని ఎంతో హీనంగా చూశారు. అలాంటి మహనీయులు ఎంత మందో వున్నారు ఈ నాటి సంఘములో. ఆడపిల్లలతండ్రి అంటే వినయ విధేయతలు వుండాలగానీ వాటిని అవకాశముగా తీసుకొని అగౌరించడము ఏంత నీచము. కన్న కడుపు అంటే ఏమిటో, వాత్సల్యమేమిటో నేను అర్ధము చేసుకొన్నాను. ఈ 20 సం॥లు

నా జీవితాన్ని స్వర్గతుల్యంగా చేసుకొన్నాను. ఇంక ఎలా అవుతుందో'' అంది దీనంగా. ముసలి డాక్టరు "ఎవ్వరు నీ వెంట రావడము లేదా?'' అన్నాడు. ఆమె "వాళ్ళ గడప మేము తొక్కము మా గడపవాళ్ళు తొక్కడము మానేసి సంవత్సరమయింది. నేను చుట్టూ అవరించిన వింతకూతలతో కూడిన భయంకర జంతువులవలే వున్న ఈ సంఘానికి భయపడి పోతున్నా'' నంది. ఇంతలో డాక్టరు ప్రక్కన కూర్చొనివున్న డాక్టరు కూతురు నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. డాక్టరు కూతురితో ఆమె "అమ్మా నువ్వూ అత్తగారింటికేనా పోవడము. నాకు వున్న కొద్ది అనుభముతో ఎన్నో విషయాలు గ్రహించాను. మళ్ళీ మంచిరోజులు వస్తాయని ఆశిస్తున్నాను.'' అన్నది. నిశ్చింతగా రైలు ముందుకు పరిగెత్తిపోతున్నది. నా ఆలోచనలు మరీ త్వరగా పరుగెత్తుతున్నాయి. నిజంగా ఎంత వింతగా వుందీ సంఘము.

...తరువాత ఒక సంవత్సరమునకు నేను గూడూరు స్టేషన్‌లో అటూ ఇటూ తిరుగుతుంటే ఇంతలో మా Class mate మోహన్ కనిపించాడు. "ఏ మోయి మోహన్ ఏమిచేస్తున్నావు ఇప్పుడు.'' మా ఊరిలో School లో పని చేస్తున్నానన్నాడు. నీవు ఎక్కడకి పోతున్నావు ఏంచేస్తున్నావని మోహన్ అడిగాడు. తను మద్రాసులో పని చేస్తున్నాననీ, తిరుపతికి పోతున్నానన్నాడు. మోహన్ నవ్వుతూ నేను "Family తో తిరుపతికి పోతున్నాను. Waiting Room కు రమ్మ''న్నాడు. ఆ నాడు నేను రైల్లో చూచినది మోహన్ భార్య అని, వాళ్ల కొడుకుతోకూడా తిరుపతికి వస్తున్నారని తెలిసికొని ఆనందించా. వాళ్ల వల్ల నా తిరుపతి ప్రయాణము ఆనందముగా సాగింది.

---

# శ్రీకృష్ణ మహిమార్ణవము

## శ్రీ కే. యన్. కేసరిగారికి అంకితము.

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

(గతసంచిక తరువాయి)

### చతుర్థతరంగము

#### రాధయెవరు

మరునాడు క్లబ్బుకు ప్రయాణమగుచున్న తండ్రిని జూచి, పెద్దపిల్లవాడు "నాన్నా! మీరీవేళ క్లబ్బు మానుకోండి. ఈ రోజు రాధాకృష్ణుల విషయమై తెలిసికోవలసి వున్నది" అనేసరికి తండ్రి, "సరిపోయింది మీ అమ్మచేసే పురాణ కాలక్షేపంకోసం నేను క్లబ్బు మానివేయమంటావా. ఏమిరా" అనెను. "తప్పక మానుకోండి" అని "అమ్మా! నీవురా. వెంటనే కథ పూర్తిచేయవలసి వున్నది. నాన్నగారు క్లబ్బుకూడా మానివేసారు" అన్నాడు. తల్లి వచ్చింది. భర్తనుద్దేశించి రాధనుగూర్చి సందేహాలేవో వున్నాయని అంటిరి. ఆసందేహాలు చెప్పండి అన్నది. అంతట తన చేతిలోని బ్యాట్ మేకుకు తగిలించి కోటువిప్పి వంకెనువేసి, బూటువిప్పి మూలకునెట్టి వాలుకుర్చీలో సుఖాసీనుడై చెప్పుతావిను అని తన సందేహాలు యీరీతిగా ప్రారంభించెను.

రాధ ఆహ్లాదినీశక్తియు ఆదిశక్తియనియు కొందరు చెప్పుదురు. అయితే రుక్మిణి యెవరు. రుక్మిణి, సీత ఆదిశక్తి స్వరూపిణులనియును శ్రీమన్నారాయణునకు నిత్యానపాయినులనియును చెప్పుదురు గదా! రాధయెవ్వరు. భాగవతమున రాధాప్రసక్తి యెచ్చటను గానరాదు. రాధ ఆదిశక్తియైనచో కృష్ణునితో సదానిలిచి భార్యయైయుండవలదా? కృష్ణునకు అష్టభార్యలున్నట్లు కలదుగాని రాధను వివాహమాడినట్లు కనుపట్టదు. ఈ సందేహము నన్ను బాధించుచున్నది; అదిగాక వేరొక సందేహముగలదు. గోకులబృందావన గోపికలకు కృష్ణుకు గల ప్రేమయెట్టిది? అది విత్రభావ సహితమగు ప్రేమా? లేక మోహప్రేరితమగు దేహసంబంధమగు కామేచ్ఛయా?

భార్య:- ఈ రెండు ప్రశ్నలు చాలమందిచే భక్తుల నడుగబడినవే. వీనికి సమాధానము చెప్పుట మిక్కిలి కష్టము. అయినను నేవిన్నంత కన్నంత, నా స్వల్పబుద్ధికి తోచినంత చెప్పెదను. మీరు గూడ బాగుగా విచారించండి.

రాధాకృష్ణులు మహోన్నత దివ్యస్వరూపమై భావనాతీతమైన పరిశుద్ధ ప్రేమ తత్త్వమూర్తులని పెద్దలు చెప్పెదరు నా విశ్వాసమదియే. వారిరూపములు లీలలు దివ్యములు. వారిలీలారంగము సయితము దివ్యమే! పరిశుద్ధ దివ్య వస్తుమయమైన హృదయములు శరీరములు గలవారి యెదుటనే వారి లీలా విలాసములు ప్రదర్శింపబడినవి. రాధాకృష్ణులు దివ్యమైన ఉపనిషణ్మయ శరీరధారులుగాక, కేవలము పాంచభౌతిక శరీరధారులే అయినచో అనగా ఆవరణ రూపధారులే అయిన యెడల వారి రూపము మాయను జయించి గుణాతీతులై ఆత్మనిష్ఠులై బ్రహ్మానందానుభవరతులైన ఋషులు భక్తులు అనువారి నాకర్షించుటయు అట్టిమహాయోగులు రాధాకృష్ణుల పాదపద్మారాధకులైయుండుటయు సంభవింప నేరదు గదా! కావున వారు దివ్యసుందర మంగళమూర్తులని చెప్పక తప్పదు.

దివ్యలీలల దర్శించుటకు, వినుటకు, వర్ణించుటకు తెలిసికొనుటకు దివ్యదృష్టి దివ్యశ్రోత్రములు దివ్యవాక్కులు దివ్యధిషణగలియుండుటవసరము. కావున మన బోటి కేవల ప్రాకృతశరీరధారులు ఆ మహత్తర దురవగాహ దివ్యసత్య స్వరూపమెట్లు వర్ణింపగలరు తెలిసికొనగలరు?

సచ్చిదానంద స్వరూపిణియై అపరిమిత దివ్యమహిమ సంపూర్ణముగా జూపిన శ్రీ కృష్ణభగవానునకును, మాయా మానుషరూపధారియగు శ్రీరామునకును భేదములేనట్లే, రాధా, రుక్మిణీసీత మున్నగు దివ్యశక్తిస్వరూపిణులకు భేదములేదు. లీలావిగ్రహుండగు నీశ్వరునకు హ్లాదినీశక్తి నిత్యానపాయినిగా నేదో పేరుతో శక్తిరూపధారిణియైయుండనే యుండును. ఈ శక్తి వేరు వేరు పేర్లతో కనుపడుచున్నను అవియన్నియు నొకే శక్తియొక్క భిన్నరూపములే! శ్రీ కృష్ణుడు రాధతో నొకనాడిట్లనియెను.

"ప్రియమైన రాధా! నామహోన్నత స్థానమగు గోలోకమందును, గోకులబృందావనమునందును, నీవు రాధానామముతో నాతోనున్నట్లే వైకుంఠమందు మహాలక్ష్మి సరస్వతిమున్నగు నామములతోనున్నావు. క్షీరసాగరశాయియగు విష్ణుమూర్తితోనుండు మహాలక్ష్మివి నీవే! ధర్మనందనుని భార్యయగు 'శాంతి' యను విగ్రహధారిణివి నీవే! భారతమున జెప్పబడిన కపిలుని భార్య 'భారతి'వి నీవే! ద్వారకలో రుక్మిణి, మిథిలానగరమున సీతవు నీవే! గుణవతియగు ద్రౌపదినీ ఛాయయే! అని చెప్పెను (బ్రహ్మకైవర్తపురాణము కృష్ణకాండము 126 అధ్యాయమున కలదు)

వాస్తవముగా హ్లాదినీశక్తికొఱకే యీశ్వరుడనేక విధములుగా, లీలావిగ్రహములు దాల్చుచుండును_ పరమాత్మ తన అనంతస్వరూపమును విపులముగా ప్రదర్శించుటకే అనంతస్వరూపములను నూతనపరిస్థితులలో ననుభూతినొందుటకు ప్రేమానంద స్వరూపముల ధరించి యానందించుచుండును.

దివ్యప్రేమావతారమగు రాధ, భగవానుని యానందరస మూర్తిభావమైయున్నది. ఆ మూర్తియందే ప్రేమలక్షణములన్నియు కేంద్రీభూతములైయున్నవి. కాబట్టి రాధ ప్రేమసర్వస్వము. శ్రీ కృష్ణుడానంద సర్వస్వము. ఆనందమున్నచోట ప్రేమయుండును. ప్రేమగలచోట ఆనందముండును. కాబట్టి రాధా కృష్ణునియోగమసాధ్యము. అసంభవము. దివ్యమై ఆనందమయమైన కృష్ణరూపము దివ్యప్రేమ మయ మూర్తియగు రాధకొఱకే గ్రహింపబడుచుండును. ఆమె కృష్ణుని ప్రాణవాయువు - కృష్ణుడామె జీవనాధారమగుమాట! అనంత శక్తిగల హ్లాదిన శక్తికిలోబడినవై వేలకువేలు చిల్లర శక్తులు గూడ కలవు. రాధా కృష్ణులకు నిరంతర సేవసేయుచు వారి యానందమునకై ప్రయత్నించుచేటే యీ పరిమిత శక్తుల పని. ఈ పరిమిత శక్తులే గోపికలు. అయితే పరబ్రహ్మయై సచ్చిదానంద స్వరూపమై ఏకమై పూర్ణమై అనంత బ్రహ్మాండ కుక్షియై అవిచ్ఛిన్నమైన పరమాత్మకు సుఖానుభవవాంఛ యెట్లు గలుగును? ఏల గలుగును? ఈ ప్రశ్న సహేతుకముగానే తోచును. కాని యిది పరమ సిద్ధాంతము చేయుటకు వీలులేదు. ఎట్లనగా భావప్రేమలు వస్తుతః పరమాత్మకు భిన్నములుగావు.-ప్రేమించువాడు, ప్రేమాస్పద విషయమునుగూర్చి పొందు భావమే భావము.-ప్రేమింపబడు వస్తువు ప్రేమించువానిపైగూడ నొక భావము పొందును - గోపికలు ప్రేమించువారు. అనగా, వారు ప్రేమప్రవాహములులేక ప్రేమించుటకు తగిన కాల్వలు - ఉపాధులు - కృష్ణుడు ప్రేమ గ్రహించువాడు అనగా దేనివంక ప్రేమ ప్రవహించునో అట్టి పరమావధి - గోపికల జగతీత ప్రేమయే పరబ్రహ్మమందట్టి యానంద వాంఛను గలుగజేయును. ఈ వాంఛ భౌతిక కామస్వరూప స్వభావములు గలదిగాదు - ఇంద్రియతృప్తికొఱకేర్పడు వాంఛ కాదు - దివ్యానంద ప్రేమలు - అవిభక్తములు - అనగా వేరుచేయు వీలులేనివి. - భగవానుడిట్లొకచోట జెప్పెను.

శ్లో॥ యయాత్వంచతయహంచ భేదోహినావ
[యోర్ధ్వం
యయాక్షీరేచ ధావళ్యం యయాగ్నే వహ్నికా
[సతి,
యయాపృధివ్యాంగంధశ్చ తయాహింత్వయి
[సంతతమ్ ॥

అనగా నీవేదో నేనదే! నీకు నాకు భేదము లేదు - పాలకు ధావళ్యమును అగ్నికి దాహకత్వమును భూమికి గంధత్వమును అభేద్యమైనట్లు నేనెల్లప్పుడు నీలోనున్నాను. అట్లే సీతా రామ, లక్ష్మి

వల్లనే బృందావనమందు మృగ విహంగమతరులతాదులై పుట్టిరని చెప్పుదురు.

గోపికల నిష్కామ ప్రేమస్వరూప భావములను, రాధయొక్క ప్రేమస్వరూప స్వభావములను, ఆనంద రస స్వరూపుడగు పరమేశ్వరునకు లీలావినోద వాంఛ గల్గిన కారణములను, తెలిసికొనుటకును బోధసేయుటకును అందరికి సాధ్యము కాదు. ఈశ్వరునియంద నన్య భక్తిగల్గి సర్వ సమర్పణసల్పి వివిధ భక్తిమార్గముల నీశ్వరసేవా నిమగ్నులై వర్తించుచు యోగులై యోగసిద్ధులై భగవత్కారుణామృత సారము గ్రోలుచు తన్మయులైన భక్తులకే సాధ్యమగును. ఆస్థితి తర్కయుక్తుల కందరాదు. భక్తి విశ్వాసములు నిరంతర సాధనము అవసరము. అంతియేగా శ్రీ సీతా రామాంజనేయసంవాదములో గోపికలంటే అంతరార్థమిట్లు చెప్పియున్నాడు.

సీ॥ సలలితేంద్రియ గోపికలు పరప్రీతించే
చనుదెంచి తనుబొంది సంతసింప ॥
బ్రహ్మాండడిలతా విభాస్వదాధారాది కపికావళి
మహా వికాసమంద, బ్రస్ఫుటీ కృతపటుస్ఫుట
గుండ వీంద్రుడత్యానందకరముగా నాడుచుండ
బొందుగా భూమధ్యబృందావనమ్మున
ప్రత్యక్షబోధ గోపాలమూర్తి.
విమల మానసపవన హస్తములచేత,
దనసుషుమ్నా మురళి లీలదాల్చి మధురగాన
మొనరించె ననగ, నోంకారమలఘువేణు నాద
సరూపమై వెలయునంత.

బా:- అమ్మా: అయితే కృష్ణుడు భగవంతుడే నంటావా!

త :- బాగున్నది వరుస రామాయణమంతా విని రాముడికి సీతెమౌతుందన్నట్లున్నది, రేపు మరి కొంత విచారింతములే. రాత్రికి వంట కావలె ననిచులేచి వెళ్లెను. పిల్లలాటల కెళ్ళిరి. తండ్రి గారింట్లో తాను విన్నది నెమరువేసికొనుచు దీర్ఘ విచారముతో కూర్చుండిరి.

అనే భయం పట్టుకొంది మాలతిని. కాని ఏంచేస్తుంది? పాపం కళ్యాణినిచూస్తే దయకలుగుతూ ఉంటుంది. కాని మధ్య మధ్య ఎప్పుడైన జయకృష్ణకు తలనొప్పి వచ్చినా, కూతురు ఉపమకు బాధకలిగినా, ఇదంతా కల్యాణి చలువవల్లనే జరుగుతూ ఉందని తన యిల్లు సర్వనాశనంగాక తప్పదని వ్యాకులపడిపోయేది మాలతి. ఈ వ్యాకులత్వంలో ఆమెని చూస్తే కలిగే దయకాస్తామటుమాయం అయిపోయేది.

ఉపమకు మాత్రం కళ్యాణి అత్త అంటే చాల ఇష్టం. నిద్రబోయేవరకు ఉపమ కళ్యాణిని వదలదు. కళ్యాణికికూడ ఆ అమ్మాయి అంటే ప్రాణం. అమ్మాయికి స్నానం చేయించడం, అన్నంబెట్టడం—ఒకటేమిటి ఉపమపోషణ అంతా చేయడం కళ్యాణికి అలవాటు అయింది. మాలతికి మాత్రం ఇష్టంలేదు.

"కళ్యాణిని ఎక్కడికైన పంపించి వేయండి. పరాయి యువతి. అందులోను వితంతు ఆరునెలలనుండి మన ఇంట్లోఉంటే నలుగురూ ఏమనుకుంటారు?" అని భయపడుతూ భర్తతో అన్నది మాలతి. జయకృష్ణ నవ్వుతూ మాలతి మాటల్ని త్రోసిబుచ్చాడు. "నలుగురు అనేది నన్నే గదా? నీకెందుకు భయం, నీవు వూరుకో" అని అన్నాడు.

కాని మాలతి మనస్సును పీడిస్తోవున్న విషయం వేరు. స్పష్టంగా తన ఉద్దేశ్యం జయకృష్ణకు చెప్పాలనుకుంది. కాని ధైర్యంచాలక వూరుకుంది. ఇరుగుపొరుగు వారు అనుకొనే విమర్శల్లో తన కంఠం కూడ మేళవించిందనీ, తన అభిప్రాయం కూడ అదేనని భర్తకు ఎలా చెప్పడం? ఎప్పుడూ భర్తకు బిడ్డకు ఏమిప్రమాదం, ఏమిఆపద కలుగుతుందోననే భయంతో మాలతి వణికిపోసాగింది.

౨

ఏడునెలలు గడిచాయి. కళ్యాణిని ఏంచేయాలో నిశ్చయంచేయలేకపోయాడు జయకృష్ణ.

ఒకరోజు పట్నంలోని ఒక పెద్దమనిషి చనిపోయాడు. అందువలన ఆఫీసు మామూలు సమయంకంటే ముందేమూసి ఇంటికిచేరాడు జయకృష్ణ. క్రింద ఎవ్వరూ లేరు. మేడపైన ఉపమ మాటలు వినబడుతూ ఉన్నాయి. అందరు పైనవున్నారని పైకివెళ్లాడు. కళ్యాణి స్నానంజేసి జుట్టు ఆర్పుకుంటూఉంది నల్లని పొడుగైన ఆ తలవెంట్రుకలమధ్య ఆమె ఎర్రని మొఖం చంద్రబింబంలా కనబడుతూఉంది. విశాలమైన ఆమె పెద్ద నేత్రాల్లో ఒక విధమైన ఆకర్షణ నిండిఉంది. ఇంత సౌందర్యం జయకృష్ణ ఎప్పుడూ చూడలేదు. ఆమె ప్రతి శరీర అవయవంలోను యౌవ్వనం తొణికిసలాడుతూఉంది. క్షణంసేపు ఆమెను చూడాల్నేకాంక్ష అతనికి కలిగింది. ఆ కాంక్షను అణుచుకోలేక పోయాడు.

కళ్యాణిదృష్టి జయకృష్ణమీద పడింది. సిగ్గుతో తలవంచుకుంది. సిగ్గువల్ల మొహం ఎరుపెక్కింది. సౌందర్యం రెట్టింపు అయింది. జయకృష్ణ మనస్సు వశం తప్పిపోయింది మెట్లుదాటి పైకి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. "నీతో కొంచెం మాట్లాడాలి కళ్యాణీ" అని అన్నాడు జయకృష్ణ. కళ్యాణి క్రుంగిపోతూఉంది మాలతి యింట్లోలేని సమయంలో జయ కృష్ణ తనతో మాట్లాడటం ఆమెకు యిష్టం లేదు. వేరే ఏమీ లేకపోయినా మాలతికి మాత్రం తనను గురించి అనుమానం కలుగుతుందని ఆమెకు తెలుసు. అందు వలన ఆమె ఏమిమాట్లాడలేదు. జయ కృష్ణ మాట్లాడటం ప్రారంభించాడు. అతని కంఠం భారంగాఉంది. స్వరం కంపిం చుతూఉంది. "కళ్యాణీ! చనిపోయే ముందు రాధారమణ నిన్ను నాకు వప్ప గించాడు. నిన్ను సుఖంగా ఉంచడం నా కర్తవ్యం. కాని సుఖంపొందే మార్గం మాత్రం నీవే యోచించుకోవాలి."

కళ్యాణి అతని ముఖం వంక చూచింది. కాని చూడలేకపోయింది. అతని కండ్లలో ఏమున్నదో సరిగా తెలుసుకోలేకపోయింది. కాని అతని చూపుల్లో ఏమోఉంది. ఆ దృష్టిచూచి కళ్యాణికి భయంకలిగింది. ఒక విధమైన మెరుపు ఆమె శరీరమంత ప్రస రించింది. ఇది ఆమెకుకలిగిన మొదటి అనుభవం. "మీ ఇష్టమొచ్చినట్లు చేయండి. మా అక్కగారు యింట్లో ఉన్నప్పుడు మీరు నాతో మాట్లాడితే బాగా ఉంటుంది. సుశీలగారింటికి వెళ్లింది" అన్నది కళ్యాణి యెంతో కష్టంగా.

"సరే ఆమెవచ్చిన తరువాతనే మాట్లాడుతాలే" అంటూ జయకృష్ణ క్రిందికి వెళ్లిపోయాడు.

ఈ విషయం మాలతికి తెలియకుండ ఉంటుందా? మాలతి యింటికిరాగానే "కల్యాణి అత్తతో నాన్న మాట్లాడాడని" అమ్మాయి చెబితే? ఇంట్లో తుపాను చెలరేగక తప్పదు. మాలతికి ఈ విష యంతానే చెబితే? మాలతి శాంతించదూ! అమ్మాయిని చెప్పకుండా చేస్తే! ఈ ఉపాయం వచ్చింది. అమ్మాయిని దగ్గరకు చేరదీసి ఏమేమో కథలు చెప్పడం ప్రారంభించింది. తననుగురించి ఇంట్లో అశాంతి ప్రబలడం కళ్యాణికి యిష్టంలేదు. ఇందువల్లనే కళ్యాణిచాటుమాటున అణిగి మణిగివుంటూ ఉంటుంది. తన విషయం యెవ్వరికీ తెలియకపోవడం ఆమెకుయిష్టం. పాపం అభాగ్యజీవి. ఇంత సౌందర్యవతిగ సృష్టించిన విధాత ఒక్క సుఖపు క్షణం కూడ లిఖించలేదు ఆమె నుదుట.

మాలతి సుశీల యింటికి వెళ్ళింది. అక్కడ చాలా విషయాలు విన్నది. "అమ్మాయి! స్నేహితురాలు దొరికింది గదా అని పొంగుతూ ఉన్నావు జాగ్రత్త సుమా! కళ్యాణి ఉత్త పాపిష్టి. నీ యిల్లు సర్వనాశనంగాక తప్పదు త్వరగ ఆ పీడను తొలగించుకో" అని సుశీలగారి

ముసలి అత్త సలహాకూడ చెప్పింది మాలతికి.

మాలతి గుండె రాయిచేసుకుంది. జయకృష్ణతో కళ్యాణిని పంపించి వేయమని నిశ్చితంగ చెప్పివేయాలని నిర్ణయంచేసుకుంది. యింటికివచ్చింది. జయకృష్ణ ఆఫీసు గదిలో పత్రిక చదువుకుంటూ ఉన్నాడు. కాఫీ తయారుచేయమని కళ్యాణికి చెప్పింది. కాఫీత్రాగి చెబుదామనుకుంది. కాని ఆపుకోలేక ఆఫీసులోకి వెళ్లింది. జయకృష్ణ పత్రిక చదవడం ఆపివేశాడు. మాలతి అంటె అతనికి చాలగౌరవం. మాలతి ప్రక్కనే బల్లమీద కూర్చుంది.

''ఇప్పుడే సుశీల యింటికి వెళ్లివచ్చాను. తను మనయింట్లో ఉండటం ఎవ్వరికీ యిష్టంలేదు ఎక్కడికైన పంపించివేయమని అంతా చెబుతూ ఉన్నారు.'' అన్నది మాలతి.

''సరి, చేయి పట్టుకొని యింటినుండి బైటకు పంపించిరా, సరిపోతుంది'' అని అన్నాడు జయకృష్ణ కొంచెం కోపంతో విసుగుతో వెగటుగ. మాలతి నోటివెంట మాటరాలేదు. జీవించి ఉన్నంతవరకు ఆమె యిల్లు వదలదేమోనని తోచింది మాలతికి.

కళ్యాణి కాఫీ తయారు చేసింది. బల్లమీద ఉంచి వెళ్లిపోయింది. కాఫీత్రాగుతూ జయకృష్ణ భార్యతో యిలా అన్నాడు ''పాపం ఆమెను అన్ని విధాల దేముడే అన్యాయంచేశాడు. మనంకూడ ఆ కొరవ పూర్తి చేద్దామా చెప్పు! చనిపోతు రాధారమణ నాకు వప్పగించి వెళ్లాడు. ఇంక కొద్ది రోజులు యిక్కడే ఉంటుంది. ఒక సంవత్సరం తరువాత ఆమె ఇష్టం. చదువుకుంటానంటే పంపుతాను. ఆమెకు యిష్టమైతే మళ్లా వివాహం చేద్దాం. అందాక యిక్కడే ఉంటుంది. మనకు ఏమీ ఫరవాలేదు. జనం వాగుతూనే ఉంటారు. ఎంత మందిని సంతృప్తిపరచగలం?''

''ఇవాళే పంపివేయమని నేను మాత్రం అన్నానా? కొద్ది రోజుల్లో మా అమ్మగారింటికి వెళ్లాలి. మా మేనగోడలి పెండ్లి. మరి యింట్లో కళ్యాణి వంటరిగ ఉంటుందా?''

''వంటరిగ ఎందుకు! ఆమెను గూడ తీసుకొని వెళ్లు''

''నా వెంట ఎలా తీసుకొని వెళ్లేది? మంచి శకునమే! పెండ్లిసమయం శుభసమయం. వయస్సుమళ్లిన విధవల్ని కూడ పసుపు కుంకం బెట్టిన పిల్లకు ఎదురూగ రానీయరు తెలుసా! అందులోను తను పరాయి మనిషి. పిలవకుండ వాళ్ల యింటికి ఎలా తీసుకొని వెళ్లేది! వాళ్లు చెడుగా భావిస్తే.

''అయితే ఆమె యిక్కడే ఉంటుంది. వంట మనిషిని రోజంత యిక్కడే వుంచి వెళ్లు. అదనంగా డబ్బు ఇద్దాం.''

ఎదురు చెప్పలేక పోయింది మాలతి.

(సశేషము)



# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్



స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

(గతసంచిక తరువాయి)

[...స్వామి క్రికెటు ఆటగాడుగా అనుభవ, సాధకములకని డ్రిల్లు తరగతికి ఎగనామం పెట్టడానికి వేసిన ఎత్తులన్నీ ఒకటి వెంబడి ఒకటి విఫలమై హెడ్మాష్టరుగారి బెత్తము దెబ్బలు తప్పించుకొని పారిపోయి తానిదివరకు చదివిన పాఠశాలలో చదువుతున్న స్నేహితుడు రాజం కొరకు వెళ్లాడు. అది పాఠాలు జరుగుచున్న సమయంకాబట్టి వరాండాలలో ఒక్క పురుగైనాలేరు. కొంచెముసేపటికి ఒకకుర్రాడు దూరంగా కనుపించగానే ఈలవేసి పిలిచి పిప్పరమెంట్ల ఆశబెట్టి అతని చేత రాజంను పిలిపిస్తాడు. కాని కుర్రాడికియ్యవలసిన పిప్పరమెంట్లు యివ్వక పోగా — ఒక కానీ డబ్బుయిచ్చి దబాయించ పూనుకొన్నాడు స్వామినాథన్ — యిక చదువండి]

"యివాళ స్కూల్లో యేం జరిగిందో నీకు తెలుసా రాజమ్? నేను హెడ్మాష్టరుతో దెబ్బలాడేను, తెలుసా; నన్ను భర్తరఫ్ చేసేసాడు. ఇక స్కూలుకు వెళ్ళవల్సిన అవుసరం లేదు!"

"హెడ్మాష్టరుతో దెబ్బలాడేవా?" ఆశ్చర్యగా రాజమ్ ప్రశ్నించాడు!

"డ్రిల్లుకు రోజూ యెందుకు హాజరు కాలేదని సంజాయిషీ అడిగి, బెత్తంతో కొట్టబోయాడు. అది సహించలేక, అతనితో దెబ్బలాడి బయటకు వచ్చేశాను, నేనా స్కూలుకు మరల వెళ్ళినట్లయితే చాలా యిబ్బందులున్నాయి; రాజం!"

"నీకు యిబ్బందులుంటేమాత్రం, ఎక్కడకు పోతావయా?" రాజమ్ ప్రశ్నించాడు!

"ఇది స్వయంకృతాపరాధం, రాజమ్!" అంటూ, డాక్టర్. కేశవన్ యెటువంటి వ్యక్తో, అతను తనకుచేసిన ద్రోహమేమిటో వివరించి చెప్పాడు!

"నీకు మతిలేదు స్వామి, నువ్వొక్కడో విచిత్రపు వెధవలావున్నావ్?" అన్నాడు రాజమ్.

"అయితే సాయంత్ర సమయములందెట్లా వస్తావనుకున్నావ్: ఆట అడేందుకు?"

స్వామి, ఆఖరిసారిగా రాజమ్నుజూచి, ఒక గుడ్ బై కొట్టేసి, తన బుర్రలో రచించిన ప్లానుప్రకారం

చేయసిద్ధపడ్డాడు. కానీ - అసలు విషయాన్ని (తన ప్రయాణంగురించి!) మరుఁగపరచ నిశ్చయించాఁడు. తాను యీ వూరువిడిచి యెక్కడకో పోతునట్లు రాజమ్‌కు చెప్పినట్లయితే, కథ అడ్డం తిరక్క మానఁడు!

ఆ కారణంచాత యీ విషయమై రాజంతోఁగాని మణితోఁగాని స్వామి ప్రస్తావించేందు కిష్టపడటం లేఁదు! ఒకవేళ రాజమ్ బలవంతంమీఁద ఆపివేయబడినా, తానెక్కడ నివశిస్తాడు? యింటికిపోతే తండ్రి తన్నకమానరు!

ఇంకా క్రికెట్ మేచికి రెండురోజులు వ్యవధుంది! యీ మేచి రెండు రోజులూ తలెక్కడో దాఁచుకొని, మేచి ఆడేసి, మరల పలాయన మంత్రం పఠించటం మంచిదనుకున్నాఁడు!

"రాజమ్, మేచి సమయంలో నేను వుండటం నీకు చాల అవుసరమా?" అప్రయత్నముగా స్వామి ప్రశ్నించాఁడు!

"అటువంటి వెధవప్రశ్నలు వింటూంటే నాకు తలకాయినొప్పి! నువ్వులేందీ అసలు మేమే పనీ చెయ్యలేము స్వామీ! నీమీఁదే ఆధారపడియున్నాము నీకన్నా మంచి బౌలరు మాకెవరున్నారు చెబ్దూ?... అయితే స్కూలుకు వెళ్ళకుండా యేంచేద్దామని!" రాజమ్ ప్రశ్నించాడు.

"వర్కుషాపులోనో, ఎందులోనో ప్రవేశిస్తాను!"

"యిదివింటే మీనాన్నగారు యేమంటారోఁ దెలుసా" రాజమ్ ప్రశ్నించాడు.

"ఏమీ అనరు! చాలా బాగుందంటారు పైగ!! అతను నన్ను బాధపెట్టరు!"

"సరే, క్లాసుకు నేను పోవాలి; చాలా ఆలస్యమయింది. సాయంత్రం ఫీల్డుకు దబ్బున వచ్చేయ్; తెల్సిందా మరిచిపోకు!" అంటూ రాజం ముందుకు నడక సాగించాఁడు ...

## 22

చల్లని నీడలను వెదజల్లుతూన్న పండ్లగల వృక్షములెక్కువగా వుండటంచాత, రాజబాటకు యెడమ ప్రక్కగాచీలి, పోతూన్న మరియొకబాట స్వామి నెక్కువగా యాకర్షించింది.

ఆ రోడ్డుగుండా ఒక మైలు స్వామి నడిచాడేగాని, యింకా రోడ్డుమీఁదనుండి ప్రయాణం చేసేందు కిష్టపడటంలేఁదు. ఆ బాటంతా నిర్మానుష్యముగాను, యెడారిమల్లేవుంది!

మరల వెనక్కు తిరోగమించి, ట్రంకురోడ్డుమీఁదనుండి ప్రయాణం చేసినట్లయితే - మనుష్యుల అలికిడి తనకు గోచరించవచ్చుననుకున్నాఁడు!

ఇంటివిషయమై స్వామి యాలోచించగానే, వాడి హృదయం వికలమైజొచ్చింది. తమ వంటవాడెంత రుచిష్టా వంటకాలను తయారుఁజేస్తాఁడు? ఎంత ఆప్యాయంతో తన తల్లి - పెరుగుదాచి, అడక్కుండానే, తండ్రికయినా వెయ్యకుండా, తనకు వేసిన రోజులు జ్ఞప్తికి వచ్చాయ్!

నడవటంచాత స్వామికి కాళ్లు నొప్పిడసాగాయ్! క్రమక్రమంగా సూర్యుని తీక్షణ కిరణజాలమంతా చల్లారుతూ, సూర్యుని అస్తమయాన్ని తెలుపుడు, జేస్తున్నాయ్. పక్షులు తమ తమ గూండ్లు చేరుకుంటున్నాయ్!

కడుపులో ఆత్మారాముఁడు విపరీతంగా అరవటంచాత, స్వామి సమీపంలో తినేపండ్లను - చెట్టునుండి తెంపుకుని, తిని - కడుపునిండా నీరు త్రాగఁడు!

కొంతకాలం అక్కడ విశ్రాంతిఁదీసుకుని, ట్రంకురోడ్డుకు పయనం కట్టాడు ...

అప్రయత్నంగా సూర్యభగవానుని అనంతరం రాజ్యపరిపాలన చేసేనిమిత్తం 'చీకటిదేవత' ప్రవేశించింది. తను చుట్టూవున్న వృక్షజాలమంతా 'సిరా' మచ్చల్లా స్వామికి గోచరింపసాగినాయ్! ఏదెట్లున్నా, ఎంత రాత్రయినాసరే, ఓవరకు ట్రంకురోడ్డు చేరుకోవాలన్న వుద్దేశంతో పట్టుదలగా నడుస్తున్నాడు!

ఇంకా ప్రయాణాన్ని అలాఁగే సాగిస్తూయున్నాడు! ట్రంకురోడ్డుకు కొలది దూరంలోనే స్వామి నడుస్తు

న్నాడు! తాను ట్రంకురోడ్డు చేరుకోగానే, కొద్ది సేపు విశ్రాంతిదీసుకొని, యింటికి పయనమయేందుకు నిశ్చయించాడు!...

* * *

మెరెంపీ అడవులకు దగ్గరగానున్న తన గ్రామమునకు 'రంగా' మాల్గుడినుండి బండి తోలుకుంటూ వచ్చేస్తున్నాడు! ప్రశాంతత పుంజీభవించిన ఆ ప్రదేశములో యెద్దులకుగట్టబడిన గంటలశబ్దం: దూరాన అడవిలో ప్రతిధ్వనిస్తూంది!

అప్రయత్నంగ బండికి కట్టబడిన యెద్దులు ఒక్కమారుగా ఆగిపోయి, ముందుకొక్కడుగు వెయ్యటం లేదు. బండి మొత్తాళ్ళమీద పడుకున్న రంగావాటి నెంత కొట్టి తోలినా కదలటంలేదు. అవి మెడలు కదిపినప్పుడెల్లా గంటల తాలూకు శబ్దం విపరీతంగా వినబడుతున్నాయ్. రంగా కారణం తెల్సుకుందామన్న యుద్దేశముతో లేచి, కూర్చున్నాడు!

రోడ్డుకడ్డంగా స్పృహలేక పడిపోయిన ఒక కుర్రవాణ్ణి (స్వామి) రంగా చూచి.—

"ఓయ్, మొద్దూ, లేవయ్యా, పడుకోడాన్కి మంచి స్థలమే యెంచుకున్నావ్. లే, లే!" అని తట్టి లేపసాగాడు, చైతన్యముడిగి, నిస్సహాయంగా పడిపోయిన ఆ కుర్రవానినుండెటువంటి సమాధానం రంగాకు రాలేదు!

"ఓయ్‌కుర్రాడా! లెమ్మంటే లెగవేందియ్యా? సెప్తుంటే నీక్కాదూ? నెగు, నెగు! ... నెగొన్!" అంటూ, వాడిముఖం దగ్గరగా ముఖంపెట్టి, పరిశీలించి వొక్కమారు గచ్చుమన్నాడు!

"అయ్యో, భగవంతుడా, చచ్చి వూరుకున్నాడు!" అంటూ, చెయ్యవల్సిన పరీక్షలన్నీ చేసి చూశాడు,

వాడు ధరించిన దుస్తులతీరునుబట్టి, నగరవాసి యని వెంటనే పోల్చుకున్నాడు. వీడెవడై వుంటాడు? ఎక్కణ్ణుంచి వచ్చినట్లు? యిక్కడెందుకున్నాడు? యిటువంటి ప్రశ్నలేరంగా మెదడును కలవరపరుస్తున్నాయ్!

క్రమంగా స్వామి తెలివిని కోలుకున్నాడు. తన ముందరున్న వస్తుసముదాయమును జూచి అర్థం చేసుకునే స్థితికి వచ్చాడు!

గోడకు వ్రేలాడదీయబడిన బొమ్మవైపే దీక్షగా జూస్తున్నాడు! యింతకీ - అది బొమ్మా? క్యాలెండరా? ఇటువంటిదే తన పడకకదుటి గోడమీద (యింటిదగ్గర) వ్రేలాడగట్టారు. తన నిజపరిస్థితి నంతా అర్థంచేసుకునే సమయానికి, స్వామి తొట్రుపాటు పడసాగాడు!

స్వామిముందర వేయబడిన కుర్చీలో కూర్చున్న ఒక వ్యక్తి.—

"నీవొంట్లో కులాసాగా వుందా?" అని ప్రశ్నించారు.

అతనెవరోగాని స్వామిదృష్టికి అచ్చంగా తండ్రిలాగోచరించారు. తన తండ్రి యిక్కడెందుకు కూర్చున్నారనుకున్నాడు!

"నాన్నా!" అన్నాడు మెల్లని కంఠంతో!

"ఇప్పుడే - మీ నాన్నగార్ని చూడగలవ్. విచారించకు!" అంటూ, యేవో ప్రశ్నలు స్వామిని ప్రశ్నించారు.

ఎవరితను? తన తండ్రా? తన తండ్రే ఐతే, ఇక్కడెందుకున్నట్లు? కానప్పు, యెవరైనట్లు యితను? ఇతనేమిటి చెబుతున్నాడు? తను చెప్పేమాటలను, స్పటంగాను, గట్టిగా యెందుకు చెప్పడు?... ఇటువంటాలోచనలతోనే స్వామి హృదయమంతా కలతచెందుతూంది!

ఆ వ్యక్తిగదిని విడిచిపెట్టి వెళ్ళిపోయారు ... రంగా - చైతన్యరహితుడై రోడ్డుకడ్డంగాపడిపోయిన స్వామిని రక్షించి, తన యజమాని: జిల్లాపారెస్టాఫీసరైన: ఎం. పి. యస్. నాయర్‌గారింటికి తీసుకు వచ్చాడు,

ఆ మర్నాడు - నాయర్‌గారు వుత్సాహంగా వున్న స్వామినిజూచి ఎంతో సంతోషించారు. కాంపౌండులోవున్న చెట్టుకు కొలంది దూరములో రాళ్ళగుట్ట దగ్గరనిలబడి. రాళ్ళతో చెట్టుమానును గురిజూచి కొడుతున్నాడు!

"సుప్రభాతం అబ్బాయ్! యిప్పుడెట్లావుంది నీవొంట్లో?" అని ప్రశ్నించారు!

"మీకు నాకృతజ్ఞ తెల్పుఁడుఁజేస్తున్నాను. నన్ను పెద్ద విపత్తునుండి కాపాడిన మహానుభావులు!"

"అవును ... చాలా సందడిగా వున్నావే?" అన్నారు.

"నేను ప్రాక్టీసు చేస్తున్నాను. యు. యం. యు. వారితో క్రికెట్ ఆట ఆడేందుకు నిశ్చయించాం. పాపం, రాజమ్ బౌలింగ్ (Bowling) విషయములో నా మీఁదే అధికంగా యాధారపడియున్నాఁడు! వాళ్ళందరూ నన్ను - 'టేట్' (Tate) అని పిలుస్తూ వుంటారు. చాలా కాలంనుండి, నాఁడు — నాఁడు — ప్రాక్టీసన్నదే బొత్తిగా లేఁదు ... ఇవాళ యేం వారం బాబూ?" అని ప్రశ్నించాఁడు!

"ఎందుకని?"

"అయ్యా, చెప్పండి బాబూ! మా మేచి కింకా యెన్నాళ్లు వ్యవధుందో తెల్సుఁగోవాలనివుంది?"

"ఇవాళ - ఆదివారఁ!"

ఇవాళ, ఆదివారమా?" అంటూ నిశ్చేష్టుడై పోయాడు.

"అసలు సంగతేమిటయ్యా?"

"మా మేచి - ఆదివారమునాఁడే!" అన్నాఁడు. స్వామి!

"అవునీ! నీకో రోజు వ్యవధుందిగా!! యివాళ శనివారంలే!"

"మీరు _ ఆదివారమని చెప్పారే?"

"లేదు, లేదు. శనివారం. కావలిస్తే - క్యాలెండరు చూఁడు!"

"కాని, ఆదివారమని చెప్పారే?"

"ప్రమాదవశాత్తూ - నాలుఁక జారిందయ్యా!"

"సరిగ్గా ఆదివారంనాటికి ఫీల్డుకు చేరుకోఁగలనంటారా?"

"యీ సాయంత్రమే. అయితే - మీ యిల్లెక్కడున్నదీ, ఎవరి కుమారుఁడవో, నువ్వు నాతో చెప్పవల్సి వుంటుంది"

## 23

"నువ్వు చచ్చావనుకున్నాన్రా స్వామి!" అన్నాడు మణి!

"అంతవరకు పోయాను"

"ఆ హెడ్మాష్టరుతో దెబ్బలాడటం యెందుకూ, పారిపోవటం దేనికయ్యా? రాజమ్ చాలా బోగట్టాలు చెప్పాడులే!"

మా స్కూలుకు నువ్వు వచ్చినప్పు, నన్ను పిలవనందుకు నీ బుజాలను విరగ దబ్బవల్సిందే!"

"నాకు వ్యవధిలేక పోయింది మణీ!"

"నువ్వు మరల బ్రతికి వచ్చినందుకు చాలా సంతోషమేస్తూంది! యిన్నాళ్ళూ యెక్కడున్నట్లు?" అని ప్రశ్నించాఁడు!

"నేను — నేను — నేను — ఏమిటో, చెప్పలేకుండా వున్నాను. నేనెక్కడున్నానో నాకేఁదెలియదు. ఎక్కడో"

"నువ్వటువంటి వెధవవని నాకుఁదెలుసయ్యా?"

"ఆ బండివాడు, రోడ్డుమీద శిలా ప్రతిమలా పడిపోయిన నన్ను తీసి రక్షించినట్లు స్మృతేలేదు.

"వాడు - దీపావళికిగాని, సంక్రాంతి పండుగప్పుడు గాని మీ యింటికి వచ్చినప్పుడు వాడ్ని, వాడు చేసిన వుపకారాన్ని విస్మరించకు! వాడేగాని నిన్ను రక్షించకపోతే, యీపాటికి నిన్నే పులో పలహారం చేసి వుండును!"

"మరో తెలివితక్కువపని చేశానయ్యా! నేను యింటికొచ్చేసే ముందర ఆ నాయర్ గార్కి వందనము లర్పించి, కృతజ్ఞత తెల్పటం మర్చిపోయాను!" అన్నాడు స్వామి.

"నీకు జాగ్రత్త బహుతక్కువ స్వామీ! నీకు మర్యాద తెలీఁదు!"

"అయితే ఏం చెయ్యమంటావయ్యా? వుత్తరం వ్రాస్తే?"

"రాయ్. అతని చిరునామా దెలుసా?" మణి ప్రశ్నించాఁడు!

"మా నాన్నకు తెల్సుండాలి"

ఇంతకీ - యేమిఁటి రాద్దామనుకుంటున్నావ్?"

"ఏమిటి రాయాలో తెలియటం లేఁదు. మా నాన్ననడిగి రాస్తా. యింతకీ నన్ను మేచి రోజుకు తీసుకువచ్చారు!"

"ఏమంటున్నావ్?

"నీకు చెముడా? మా నాన్న గారితో చెప్పి, ఉత్తరం రాయమంటానని చెప్పాను. అంతే!"

"అదికాదు! ఏదో మేచి **గురించి** విన్నాను. అదేమిటి?

"అవును!"

"మేచికి సరియైన వేళకు వచ్చాననుకుని భ్రమపడుతున్నావా?" అని మణి ప్రశ్నించాడు.

యు. యం. యు వారితో జరిగిన మేచి వివరములు, ఎం.సి.సి. అపజయానికి స్వామే విధంగా కారకుడో మణి, స్వామికి విపులంగా వివరించి చెప్పాడు.

"యివాళ శనివారంగా!" స్వామన్నాడు!

(సశేషము)



ఈస్టిండియావారి "పక్కయింటి అమ్మాయి"లో అంజలిదేవి



## చిన్ని కృష్ణుని చిట్టి అలుక

"పెంకి పనులను మానవేమీ
జంకు కొంకూ లేవనీకూ?
చప్పు డెందుకు చేతువంతగ
తప్పు కృష్ణయ్యా."
అనుచు తల్లి యశోదపలుకగ
అలిగి కృష్ణుడు తుర్రుమనుచును
పారి పోగా బార చాచీ
తల్లియిట్లనియెన్.
"కన్ను మూసితి చిన్ని కృష్ణయ
అమ్మ వచ్చెనో బాబువచ్చెనో
కాకి వచ్చెనో చిలుక వచ్చెనో
ఎవరు వచ్చెదరో!"
మొలను గట్టినమువ్వ మ్రోయగ
పరుగు పరుగునవచ్చి కృష్ణుడు
నవ్వుతును కేరింతలాడుచు
తల్లి రొమ్మానెన్

న. రా. శివస్వామి

# ఎత్తుకు పై ఎత్తు

శ్రీమతి పి. జె. శాంతమ్మ

అంతవరకు ప్రక్క ఇంటిలో పస్తులతో చస్తున్నా చిట్టెమ్మను ఒక్కనాడూ పలుకరించలేదు రామారావు. ఆ వేళ "ఏం చిట్టమ్మా! బాగున్నావా? ఏంటి కథ" అన్నాడు. పాపం మొన్ననే మశూచికం పోసి కంటిలో పువ్వు వేసిందికదూ ఒక్కటేదారి చూపుతుంది. ఆ కంటితో వడవడ వణికే కంఠంతో "ఎవరు బాబూ!" అంది గుండెమీదఉన్న పీలిక సరుదుకొంటూ! "నేను రామారావును." "తమరా! బాబూ!" అంది ముడుతలుబడిన బొక్కినోరువిప్పి. "ఆ! నేనే! నీ వెలాఉన్నావో ఒకమారుచూచి పోదామని ఇలావచ్చా" "అయ్యో! ఎంత దయబాబూ! ఈ దీనురాలిమీద." "సరే వస్తా!" "చిత్తం." "ఏమైన కొనుక్కు తినుఅంటూ 5 వెండిరూపాయిలు ముసలి చేతిలోపడేలావిసిరి" వెళ్ళి పోయాడు. "ఏమిటి? అమ్మో! వెండిరూపాయిలే! లక్ష్మి వచ్చింది మా యింటికి" అనుకొంటూ "ఆవేళ మా ముసలతన్ని మెడబట్టి గెంటేసినప్పుడు బోర్లపడితే ముక్కు, మూతి చితికిపోయిందే, అలా తీసుకొనే చచ్చిపోయేడే. ఇది అన్యాయమని అడిగానని ఆ వెంటనే నన్నుపని మాన్పించేసాడే ఇంతకు మేముచేసిన నేరం! జామచెట్టెక్కి పండుకొయ్యలేక పోయాడు. కుర్రాడు ఏడ్చాడు. తనకూడుతింటూ తనబిడ్డకోర్కె తీర్చలేకపోయాడనేనా? ఆ ముసలాడు చెట్టెక్కితే కాళ్లువణికిపడిపోతానని భయపడ్డాడు. అంత కఠినహృదయుడు – ఈ వేళ, ఏమబ్బా! ఒకవేళ పాతనేరానికి పశ్చాత్తాపంకలిగిందేమో?" అనుకొంటూ బుట్ట చంకబెట్టుకొని తడకజారేసి బజారుకు పోయింది చిట్టెమ్మ.

ఒకప్పుడు బాగానే బ్రతికింది. అన్నిహారతైపోయాక, రామారావుగారింట్లో భార్యాభర్తలు నౌఖరికి కుదిరారు. ముసలాయన పెద్దపిల్లల్ని ఆడించడం, పరుపులు వెయ్యడం, మేడకు కాపుండడం. చిట్టెమ్మకు వంటపని. మరి ఆ నౌఖరిపోవడం, ముసలాయన చావడం, ఏదో చాటుగా కూలి చేసుకొని ఉన్నరోజు తినడం, లేనిరోజు పస్తుండడం. అలా పడిఉండడం. ఈ వేళ జరిగిన కథ ఇది.

ఏవేవో కొనుక్కొని వచ్చింది ఇంటికి. ఇంటిముందు సుబ్బయ్యశెట్టిగారు మరెవరో ఇద్దరు నిలబడి ఉన్నారు. "ఏమమ్మా! బాగున్నావా?" అని పలుకరించాడు సుబ్బయ్యశెట్టి "ఎవరు బాబూ!" అంటూ ఎండవైపు చేయి చాటుబెట్టుకొని చూస్తూ అంది. "నేనమ్మా శెట్టిని మరి మీరు బాగాఉండేటైములో నా దగ్గిరేగా వెచ్చాలుకొనేవారు. అబ్బ! ఎంతమంచి వారండీ వీరిభర్త అంతా పోయింది పాపం" అని ప్రక్కనున్నవారితో కనికరం

కారిపోతున్నట్లు చెప్పాడు. "ఏంబాబు ఇలా వచ్చారు" అంది ఆశ్చర్యంగా. "అబ్బే నీవు ఎలా ఉన్నావో చూసిపోదామని బుద్ధి పుట్టింది అలా వచ్చేసా" అన్నాడు శెట్టి. "కూర్చోండిబాబూ" "పరవాలేదు వెళ్ళొస్తా" అంటూ 5 రూ. నోటు ఆమెచేతిలోపెట్టి "పెద్దకాలం ఏదైనకొని నోట్లోవేసుకో" అంటూ వెళ్ళిపోయాడు.

అలా కొయ్యబారి నిలబడిపోయింది. చిట్టెమ్మ బిక్షానికివెళ్లిన పిడికెడు గింజలు వేయని శెట్టి ఇంటికివచ్చి కుశలప్రశ్నలు అడిగి తనంతటతానే రూపాయలనోటు ఇచ్చిపోవడం ఎవరిని ఆశ్చర్యపరచదు? వెళ్ళి బియ్యం చేటలోపోసిందో లేదో సుందరంగారు వచ్చారు. "చిట్టమ్మా! చిట్టమ్మా!" "ఎవరూ? నా గొంతుపోల్చలేకపోయావ్. నేను సుందరాన్ని" "అమ్మో! ప్రభువులు ఈ పేదరాలి ఇంటికి రావాలా? కాకితో కబురంపితేరానా?" అంది ఆత్రుతగా! "ఆ దానికేం దేశసేవ చేయడానికి పూర్తిగా పూనుకొని ఇక కారెక్కడంకూడా మానుకొని కాలినడకనే వచ్చాను" అన్నాడు ప్రక్కన ఉన్న బారెడు మీసాలాయన. "చిత్తం ప్రభువులు" "మరి అప్పుడప్పుడు ఇంటికిరా- అమ్మగారు నిన్ను చూడాలంటూ ఉన్నారు. మరివస్తా నీవేదో వంటకొంటావుకాబోలు ఇదిగో నీకు" అంటూ రెండురూపాయలు చేతిలోపెట్టి వెళ్లిపోయాడు. ఏమి తోచడంలేదు చిట్టెమ్మకు. ఈవేళ లక్ష్మీదేవికింతదయ ఏలకలిగిందో ఏమిబోధపడలేదు ముచ్చెమటలు పోస్తున్నాయి, గడగడ కాళ్లు వణుకుతున్నాయి, సుమారు పదేళ్లనుండి ఒక్కసారైన ఇలాటి అనుగ్రహంకలగని లక్ష్మికి - ఈ వేళ ఏమబ్బా! అనుకొంటూ మల్లా బియ్యపు చేట పట్టుకొంది. ఏదో పెద్ద ఊరేగింపు పాటలు వస్తున్నాయి ఆ రోడ్డువైపు. జై రామారావుగారికి, జై "నీ ఓటు ఎవరికిస్తావ్" "రామారావుగారికిస్తా," అంటూ ఆకాశాన్నంటే కేకలు తనముందునుంచే. బైటకువచ్చి అంతా చూచింది "ఏమిటిది?" అని అడిగింది ఆ గుంపులో ఒకణ్ణి. "పండుగ" "ఏంపండుగ" "ఓట్ల పండుగ రేపే ఎలక్షన్సు." ఆ! తెలిసింది. లక్ష్మి తన ఇంటికి వచ్చినకారణం మరిముగ్గురు కోరారు నా ఓటు. ఏందారి అంటూ మల్లా చేటబట్టుకొంది. అంతలో "మామ్మా" అంటూ మనవడు ఊర్కుంచి వచ్చాడు. "రా బాబూ!" అంటూ కూర్చోబెట్టి జరిగిన సంగతంతా చెప్పింది. "నీ కెందుకుమామ్మా! నే చెప్పినట్లు నడుచుకో" అన్నాడు గడుసు మనవడు. ఉదయం ఒక సైకిల్ రిక్షా, ఒక మోటారు కారు, ఒక-జట్కాబండి చిట్టెమ్మ ఇంటి ముందు ఆగాయి.

లోపల కుక్కిమంచంలో బట్టతో చుట్ట

బడిన చిట్టెమ్మ తలదగ్గర దీపంబెట్టి "మామ్మా! నన్ను వదలిపోయావా! అమ్మపోయింది నువ్వుపోయావా! నాకు దిక్కెవరు మామ్మా! ఓ మామ్మా నీ కోసం కార్లు వచ్చాయి మామ్మా! నువ్వు పూలరథంఎక్కిపోయావా? మామ్మా! అంటున్నాడు తారస్థాయిలో. వచ్చిన వారు పాపం కుర్రాడిని ఓదార్చడానికి సైమేది? వంగి లోపలికి చూడ్డం, వెంటనే పోవడం, వాళ్లకి దేపనేమిటి? ఇంకా ఇలా ఎంతమందిదగ్గరకు పోవాలో!

తెల్లవారి చూచేసరికి చిట్టెమ్మ ఖాళీ గుడిసెమాత్రం కదలక మెదలకఉంది.

గృహపరిశ్రమలు

# నారింజపండ్ల సిరప్

శ్రీ అద్దేపల్లి వెంకట సుబ్బారావుగారు



క్రిందటిమాటు నారింజపండ్ల మూరమ లేదుని గురించి చెప్పానుగదూ. ఈ పూట నారింజపండ్ల సిరప్ చేసేపద్ధతి చెప్పనా ?

చెప్పండి తప్పకుండా చేస్తాను.

బాగా పచ్చగా పండిన ఆరు తాజా నారింజపండ్లను తెచ్చి. పైనున్న పెచ్చు వొలిచి అవతల పారెయ్యాలి. అంతేనా ?

మంచిదానివే. నారింజకాయ పెచ్చుకు చాల ప్రాముఖ్యత వుందని క్రిందటిమాటు చెప్పాను. అపుడే మరచిపోయావా ? ఆ పెచ్చుల్ని రోటిలోగాని, సన్నికల్లులోగాని వేసి వొక అరపౌను పంచదారకూడా వేసి మెత్తగా నూరాలి.

ఊఁ.. నూరిన ఆ ముద్దను యేంచెయ్యమంటారు ?

ఆ ముద్ద వొక యెనామిలు పాత్రలో వేసి 2, 3 గంటలు నిల్వవుంచాలి. తరువాత పండ్లరసాన్ని పిండి గింజలు వగైరా లేకుండాజేసి ఆ రసాన్ని పై పెచ్చుల ముద్దతో కలిపి పంచదార పూర్తిగా కలిసిపోయేవరకు కలపాలి.

పండులో రసం కొంచెం తక్కువగా వుండి పెచ్చుముద్దతో కలిపిన పంచదార కలిసేటందుకు చాలకపోతే యేంచెయ్యాలి?

రసం కొంచెం తక్కువగావుంటే కొద్దిగా మంచినీళ్లకూడా చేర్చవచ్చు.

తరువాత యేంచెయ్యమంటారు ?

ఒక సన్నటి గుడ్డను తీసుకుని. దానితో పైరసాన్నంతా వడగట్టాలి. అప్పుడు క్రిందకుదిగిన రసంలో 10 పౌనులు సింపిల్ సిరప్‌నుచేర్చి చక్కగా కలిసేటట్లుగా కలపాలి.

సింపిల్ సిరప్ అంటే ?

అంటే 14 పౌనులు పంచదార వొక గిన్నెలోవేసి దానిమీద 10 పౌనులు మంచినీళ్లు కొలిచిపోసి పొయ్యిమీద పెట్టాలి. పొయ్యిమీద పెట్టమన్నానుగదా అని పెద్ద మంటమీద పెట్టేవు సుమా. సన్నని సెగచాలు, కొద్దిసేపట్లో గిన్నెలోవున్న పంచదారకరిగి నీళ్లలో పూర్తిగా కలిసిపోతుంది.

కొద్దిసేపట్లో అంటే యెంతసేపు !

గరిటతో పాకం పైకియెత్తిచూస్తే పంచదార నలుసులు యేమీవుండకూడదు.

అప్పటికి పంచదార అంతా పూర్తిగా కరిగిపోయి వుంటుందన్నమాట. తరువాత దానినిదింపి చల్లారనిచ్చి దానిలో యిష్టముంటే రెండు కోడిగ్రుడ్లు తెచ్చి వానిలోని తెల్లటి పదార్థము కొంచెం పంచదార పాకంతోకలిపి మొత్తం పాకంలో కలుపవలెను. ఈ సింపిల్ సిరప్‌ను వాక సీసాలోపోసి మూతపెట్టి అవుసరమైనప్పుడు వాడుకుంటూ వుండవచ్చు.

సింపిల్ సిరప్‌ను కలిపాక యేం చెయ్యాలి?

సిరప్‌కలిపి మొత్తం రసాన్ని బాగా వాక అరగంటసేపుకలిపి కడిగి యెండలో పెట్టిన సీసాల్లోపోసి గట్టిగా మూతపెట్టాలి.

మరి యెసెన్స్ కలుపవొద్దూ?

రంగుగాని, యెసెన్స్‌గాని అవుసరం లేదు. పెచ్చులు మెత్తగానూరి కలిపాం గదూ. ఎసెన్సు అందులోనే వుంటుంది.

నేను వ్రాసుకున్నది చదువుతాను వింటారా?

చదువు.

"బాగా పచ్చగా పండిన ఆరు నారింజకాయలు తెచ్చి పెచ్చువొలిచి రసము వాక గిన్నెలోకి పిండవలెను. కాయలమీద నున్న పెచ్చులను రోటిలోగాని, సన్నకల్లులోగానివేసి ఒక అరపౌను పంచదార కూడచేర్చి మెత్తగా ముద్దఅయ్యేటట్టుగా నూరి 2, 3 గంటలు నిల్వవుంచవలెను. తరువాత ఈ ముద్దను గుడ్డలోవేసి పిండిన రసమును, కాయల రసములోకలిపి దానిలో 10 పౌనులు సింపిల్‌సిరప్ కూడపోసి బాగుగా కలుపవలెను. సింపిల్‌సిరప్ అంటే 14 పౌనులు పంచదారను వాక గిన్నెలోవేసి దానిపైన పదిపౌనులు మంచి నీరుపోసి సన్నటి మంటమీదపెట్టి పంచదార పూర్తిగా కరిగిపోవువరకు కాచవలెను. తరువాత గిన్నెను క్రిందకుదింపి చల్లారనిచ్చి దానిలో యిష్టమున్నచో రెండు కోడిగ్రుడ్లలోని తెల్లటి పదార్థమునుగూడకలిపి సీసాలోపోసి నిల్వవుంచవలెను. సింపిల్‌సిరప్ కలిపిన తరువాత దానిని చక్కగాకడగి యెండలోపెట్టిన సీసాలలోపోసి గట్టి బిరడాలు పెట్టవలెను."

సరిగావుందా?

వుంది.

దీనినే యింకోవిధంగాకూడ చేస్తారు. చెప్పమన్నావా?

చెప్పండి వ్రాసుకుంటాను.

పండిన నారింజకాయలు తెచ్చికోసి రసంపిండి అందులో ప్రతియిరవై ఔన్సుల రసానికి పదిఔన్సులు నీళ్లుపోసి బాగా కలపాలి. తరువాత దానిలో 95 తులాలు పంచదారకూడ కలపాలి. పెచ్చుల్ని రోటిలోవేసి అయిదు తులాలు పంచదారకూడవేసి మెత్తగా ముద్దఅయ్యేటట్టునూరి రసములోకలిపి సన్నటిగుడ్డతో వడిగట్టి వాడుకోవచ్చును.

ఇది నిల్వ వుంటుందా?

ఒకటి రెండు రోజులుకన్న యెక్కువ వుండదు. కావలసినమట్టుకే తయారు చేసుకొని వెంటనే వాడుకోవాలి.

బెజవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో

# సౌమిత్రి ప్రణయం

అల్లూరి సోదరి

అది నిర్జన వనస్థలి. కొండలూ కోనలు గంభీరంగా వున్నాయి. భీకరంగా పెరిగిన చెట్ల చాటునుండి సన్నంగా సూర్యరశ్మి పడుతూంది. ఆ భీకరారణ్యంలో మృగశాబకాలూ వున్నాయి. సింహ కిశోరాలూ వున్నాయి. ఎందుకో ఆ భీకరాటవిలో తెలియని ప్రశాంతత ఆవరించివుంది. చిన్న ఆకుటిల్లు శుభ్రంగా వుంది. ఎత్తైన దిమ్మమీద శ్రీరాముడు కూర్చుని అర్ధాంగి వంక ప్రేమగా వీక్షిస్తున్నాడు. రాళ్లను పెట్టి మట్టి పాత్రను ప్రొయ్యిమీద చేర్చి, సీత వెదురు బియ్యాన్ని వండుతూంది. ఉడుకుతున్న పాత్రనుండి వేడిగంజి యెగిరి సీత చేయి సోకింది. ఆ బాధను తాళలేక కెవ్వుమనింది సీత.

పరధ్యానంగా వున్న శ్రీరాముడు దీనుల్నిరక్షించే నాధుడిలాగా లేచి యిల్లాలి చేతిని చన్నీటితో కడిగాడు. "రాజాంతఃపురాల్లోనివసిస్తూండిన నిన్ను ఎన్ని బాధల పాల్జేశాను జానకీ! అన్నాడు శ్రీరాముడు జానకి పడుతున్న కష్టాన్ని తిలకిస్తూ.

సీతాపతి పెదవులపై మందహాసం వెలిగింది. "మీరు రాజాంతఃపురవాసులుగాదా ప్రభూ! మీకంటెను, మీయర్ధాంగి సుకుమారి కాదు. ఆర్యపుత్రుల అడుగుజాడల్లోనే జానకి సుఖస్వప్నాలు కాంచగలుగుతుంది" అనింది.

"ఎండ వేడిమి ఎక్కువయింది. ఇందాకా సౌమిత్రి ఏం చేస్తున్నాడు, ఆకులూ, కందమూలాలూ, దొరికినవో, లేవో - పాపం వానికి ఎంత శ్రమకలిగించాను" అని విచారించాడు శ్రీరాముడు.

"కంద మూలాలు దొరక్క కాదు. నిన్నటిరాత్రి యేమయింది. సౌమిత్రి చల్లని వెన్నెల్లో మేలుకొని పండుకొని పాడుకుంటున్నాడు. తర్వాతలేచి వికసించిన అడవిమల్లెల్ని దండగాగ్రుచ్చి, "ఊర్మిళా, యీ వనసీమనుండి నేను నీకు పూలమాలను యిస్తున్నాను. మరినీనుండి నాకేమిటి కానుక" అని భార్యకు చెప్పుతున్నాడు. నేను చాటుగా చూచినట్టు మరిదికి తెలియదు" అనింది సీత.

సరిగా అదేసమయానికి కందమూలాలూ, ఆకులూ తీసుకవచ్చిన సౌమిత్రి వదిన మాటలువిని కొయ్యబారిపోయాడు. తన ప్రణయాన్ని వదిన చూసిందేగాక, అన్నగారి ముందర చెప్పటంవిని సౌమిత్రి సుందర ముఖంలో సిగ్గు ద్యోతకమవుతూంది.

"పాపం, పసివాడు ఊర్మిళను మనవెంటకొని రావలసింది. వివాహానంతరం, బ్రహ్మచర్యవ్రతం నడపటం భావ్యంకాదు. ఒక వంక భాతృప్రేమ, మరోవంక పత్నీప్రేమతో సౌమిత్రి పసిహృదయం" జానకిమాట పూర్తిచేయలేదు. ఎదుట నిలబడిపోయిన మరిది కనుపించాడు. కందమూలాలు వదినముందర పెట్టి తొందరగా వెళ్లిపోబోయాడు సౌమిత్రి.

శ్రీరాముని రెుద్రని పెదవులపై చిన్న చిరునవ్వు లీలామాత్రంగా మెరిసింది. "సౌమిత్రివచ్చి చాలా సేపయింది. నీవు వెనక్కుచూడకుండా చెప్పుకుపోతున్నావు. నీ మాటలన్నీ వాడూ పూర్తిగావిని, అందుకే వెళ్లిపోయాడు" అన్నాడు.

సౌమిత్రి ప్రణయాన్ని తానుభర్తకుచెబుతూండగా మరిది విన్నాడు. ఎంత చిన్నబుచ్చుకున్నాడో పాపం అని జానకి మధనపడింది. త్వరగా కందమూలాల్ని పక్వంచేసింది. ఆకులుకుట్టి శ్రీరామునికి లక్ష్మణునికి వడ్డించింది. లక్ష్మణుని పంక్తి ఖాళీగా వుంది. శ్రీరాముడు భోంచేయకుండా కూర్చుండిపోయాడు. జానకి అదరిపడి గబగబా పర్ణశాల ఆవరణలోనికిపోయి "సౌమిత్రీ! సౌమిత్రీ!" అని యెలుగెత్తి పిలిచింది. మొట్టమొదట అన్నగారి ముందర రావటానికి సిగ్గుపడి తర్వాత పోవచ్చునని లక్ష్మణుడు చెట్లచాటున కూర్చుండిపోయాడు. అయితే సీతాసాధ్వి పిలుస్తున్న సౌమిత్రీ శబ్దం,

లక్ష్మణునికి జనయిత్రి ప్రేమను వ్యక్తంచేస్తూంది. తనకు తెలియకనే పర్ణకుటిని సమీపించాడు.

ముగ్గురూ యేమీయెరగనట్లుండిపోయారు. సోదరు లిద్దరూ భోంచేశారు సీత తన భోజనం ముగించుకుని శ్రీరామునిదగ్గరికొచ్చింది. దర్భాసనంమీద విశ్రమించాడు రాముడు. కొద్దిక్షణాలకే ఆయనకు గాఢంగా నిద్రపట్టింది.

నేలవంక చూపులు బరుస్తూ మౌనంగావుండిపోయాడు సౌమిత్రి. "అంతమౌనాన్ని ధరించినావేమి సౌమిత్రీ!" అడిగింది సీత. సౌమిత్రి యేం పలకలేదు.

"నేను అన్నగారితో చెప్పింది వాస్తవమేకదా. మరెందుకు బాధపడిపోతున్నావు" అడిగింది జనకజ.

"నీవు చెప్పింది సత్యమే. అట్లని ఆర్యపుత్రుల యెదుట-ఛీ, ఛీ" తలవంచుకున్నాడు సౌమిత్రి.

జానకీ వాత్సల్యంగానవ్వి "అదికాదు మఱదీ! మీయన్నగారు నిన్ను గురించి విచారించారుకాని, మరేమీ అనుకోలేదు" అన్నది.

నిద్రిస్తున్న శ్రీరామునివంకచూచి, "అన్నగారు గంభీర హృదయులు" అన్నాడు లక్ష్మణుడు.

"సౌమిత్రీ! గంభీరం విషయంలో నీకు నీవేసాటి. వియోగం అన్న పదం నన్ను అధోలోకానికి అణగద్రొక్కినట్లు బాధపడతాను. నవదంపతులుగావుండి, మా చెల్లీ, నీవూ, దుస్సహ వియోగాన్ని భరిస్తూండేది, హృదయగంభీరత వేకాదా?" అనింది వదినె.

సౌమిత్రి భావావేశుడై, వదినె మాటల్ని భక్తిగా వింటున్నాడు. "పూలమాల విషయం నీ కెప్పుడు చూశావమ్మా" అడగలేక అడిగాడు వదినెని.

"రాత్రి పాడుతున్నపాట ఊర్మిళను గురించి అని నిర్ధారణించాను. అయినా చూస్తామని చప్పుడు చేయకుండా నీవద్దకు వచ్చాను. నీవు మల్లెలుకోసి పూలమాలకట్టి ఊర్మిళకు కానుకగానిచ్చేవరకూ చూచినాను. ఇంతలో ఎండుటాకుల చప్పుడువిని మీయన్నగారు లేవగలరని వెళ్ళిపోయినాను. పండుకొన్న వెంటనే నిద్రపట్టింది. పక్షులుకూసేవరకూ నిద్రలేవలేదు" అన్నది సీతాదేవి.

"ఆర్యపుత్రులు నీ వెంటరాలేదుకదమ్మా" ప్రశ్నించాడు సుమిత్రకొడుకు భయాన్ని తెల్పేనయనాలతో. సీతాదేవి గట్టిగా నవ్వింది. "ఆర్యపుత్రులు నిద్రిస్తూండిరికదా, వారు చూడలేదు."

కొంచెం బరువు తగ్గినట్టయింది సౌమిత్రికి. "అయితే అన్నగారికి వదినె చెప్పిన మాటలే" అన్నాడు.

"జానకి చూసింది కొంచమే. నేను సంపూర్ణంగా విలోకించాను. ఆ పూలమాలను ఊర్మిళగా వూహించి, రాత్రంతా మాట్లాడుతున్నాడు, చంద్రుణ్ణి చూపించాడు. కడకు పూలమాలను హృదయాని హత్తుకొని నిద్రించాడు" అన్నాడు రామచంద్రుడు - యిందాకా నిద్రనటిస్తూ వదినె మరదుల సంభాషణవిని.

జానకి విస్మయంగా భర్తవంక చూచింది. శ్రీరాముడు నవ్వినాడు. సౌమిత్రిలజ్జారుణ వదనంతో అన్నగారిముఖం చూడలేక తలవంచుకున్నాడు.

"వదినె పరాయిది. నేను నీ అన్నను, నేనుచూస్తే సిగ్గేల సౌమిత్రీ!" నవ్వుతూ అడిగాడు శ్రీరాముడు. సౌమిత్రి మెల్లగా పర్ణశాలదాటిపోయాడు. సీతారాములు సౌమిత్రిపోయినదారినేచూస్తూ నవ్వుకున్నారు.




భక్తిరసాయనము:—ఆంధ్రీకర్త : శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి ఎం. ఏ., ఎం. లిట్., పిహెచ్. డి. (సాగర విశ్వవిద్యాలయము) ప్రకాశకులు : సాధనగ్రంథ మండలి, తెనాలి. డబుల్ క్రౌను సైజున 218 పుటలు. సంపాదకీయ ప్రస్తావన విషయాను క్రమణికాదులు ప్రత్యేకముగ మఱొక 16 పుటలు. వెల 2-0-0

మానవుఁడు సంఘజీవి యగుటచే, సంఘము తనలో అంతర్భూతమని భావించుచు, అట్టి యాత్మవద్భావనా పరిణతికి సాధనములయిన చతుర్విధపురుషార్థములను అవగాహనము చేసికొని, సాంఘిక చైతన్యమునకు ఉన్ముఖముగఁ బ్రవర్తించినవాఁడే, అతని జీవితము చరితార్థము కాఁగలదు. ఆనంద స్వరూపమగు ఆత్మావబోధమే రసమనియు, అదియే భక్తియనియు, ఆ భక్తి సర్వరస సమన్వితశీలమనియు, నిరూపించుచు అంతర్ముఖుడును, విద్వదగ్రణియు, పరివ్రాజకాచార్యుఁడునగు శ్రీమధుసూదన సరస్వతి ఉల్లాసత్రయమున సశాస్త్రీయముగ విరచించిన "శ్రీ భగవద్భక్తి రసాయన"మను సంస్కృత గ్రంథమున కిది ఆంధ్రానువాదము. అనువాదకులగు శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దీనిని జిజ్ఞాసువులకు సులభముగ బోధపడునట్లు తేఁట తెనుఁగు మాటలతో ననువదించుట కడుంగడుఁ బ్రశంస్యము. గీర్వాణాంధ్రాంగ్లములలో నిష్ణాతులయిన గ్రంథకర్తగారు దురవబోధ విషయములను వివరించు పట్టులలోఁగూడ లలితమగు శైలిని విడువక పోషించుట వారి గ్రంథరచనా సామర్థ్యమునకొక తార్కాణము. లౌకిక పారమార్థిక సమైక్యదృష్టితోఁ బరామర్శించువారి, కిది రసాలంకార శాస్త్రాంశములను గరతలామలక మొనర్పఁగలదు.

అంతియగాక, కావ్యరచనమునఁ గవికిని, తద్రస గ్రహణమునఁ బాఠకునకునుగల యనుభూతులందు భిన్నములం గావనుటను గూర్చియు, రసోత్పాదక సాధన తత్స్థాయీభావనిరూపణమును గూర్చియు, సశాస్త్రీయము, సహేతుకము, సవిమర్శకముగ మూఁడనుబంధ వ్యాసములలో శ్రీ శాస్త్రిగారు వివరించిరి. తార్కిక మీమాంసా సిద్ధాంతములు మూలముట్టుగ జీర్ణించుకొన్నవారికిగాని అంత చక్కఁగ వానిఁగూర్చి చర్చింప వీలుగాదు. రసములను (ముఖ్యముగ భక్తిని) గూర్చి క్షుణ్ణముగఁ దెలిసికొనఁగోరు ప్రత్యాంధ్రుఁడును దప్పక చదువఁదగిన గ్రంథమిది.

సమ్యగ్దర్శనులగు నార్యుల యాధ్యాత్మిక పరమార్థమును నిట్టి గ్రంథముల మూలమునఁ దెలుఁగువారి కందించుచున్న సాధనగ్రంథమండలివారి యుద్యమమును ఆంధ్రులెల్లరును బ్రోత్సహింపఁదగును.

2. అధ్యాత్మోపనిషత్తు:—క్రౌను సైజున 60 పుటలు వెల 1-0-0

3. ఈశావాస్యోపనిషత్తు:— డెమ్మీ సైజున 168 పుటలు. కృతిసమర్పణ పీఠికాభిప్రాయాదులు మఱొక 28 పుటలు వెల 2-8-0

పైరెంటిని ఆంధ్రపద్యానువాద వివరణాదులతో విజయనగర మహారాజ సంస్కృతకళాశాలాంధ్ర పండితులగు శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ప్రచురించిరి.

ఉపనిషత్తులు ప్రస్థానత్రయములో నొక శాఖకుఁ జెందినవి. వేదములకడపట వచ్చునవి కనుక వీనిని వేదాంతములనియుఁ జెప్పుదురు. ఇవి 108 అని ప్రాచీనులమతము. జ్ఞానమును వానిమూలమున మోక్షమును సాధించుట కివి ముముక్షువులకు ఉపకరించును. ఆత్మసాక్షాత్కారమునకు అవలంబింపఁదగు విధానములను బోధించి ముక్తి సామ్రాజ్యమునకు నడుపుటయే ఉపనిషత్ప్రయోజనము. ఆత్మయే నిత్యమనియు, తక్కినవి అనిత్యములనియుఁ దెలిపి అట్టి యాత్మోన్నతికయి పరబ్రహ్మాను సంధానమును సమాధిమార్గమున జేకూర్చుకొన మానవున కుపనిషత్తులు తోడ్పడును.

శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు పైరెండుపనిషత్తులను పద్యరూపమునఁ దెలిఁగించుటతోనే తృప్తి నొందక మొదటిదానికి శ్రీ మచ్ఛంకరభగవత్పాదుల ననుసరించి అద్వైతభావముల నిరూపించుచు విశేష వివరణములను వ్రాసిరి.

రెండవదానికిని అట్లే ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతాచార్యుల వ్యాఖ్యానములను స్వాభిప్రాయములను వివరించిరి.

ఇట్టి వేదాంత గ్రంథములను దెనిఁగించునప్పుడు సామాన్యప్రజానీకముయొక్క గ్రహణశక్తిని మనసున నుంచుకొని-సమంజస సులభశబ్దములతో రచింపవలెను. అందును పద్యరూపమున వ్రాయుట సామాన్యము కాదు. శ్రీ శాస్త్రిగారీరెండు ఉపనిషత్తులను పద్యరూపమునఁ దెలిగించుటలో శబ్దౌచితి పాటించి నిపుణులనిపించుకొనిరి.

'మేనినే' నేనుగ నెఱింగి, నేనె బ్రహ్మమని తలంచుట మెట్టవేదాంతమగును,
తానయిన ప్రత్యగాత్మగా నేను నెఱిఁగి అది పరాత్మగఁ గనుట తత్త్వార్థసరణి॥

ఇది పదలాలిత్యమునకు ఉదాహరణము. శ్రీ శాస్త్రిగారి యాధ్యాత్మిక ప్రబోధము తెలుఁగువారి నలరించుగాక.

పండిత వేదం వెంకటకృష్ణ శర్మ

సాధనరహస్యము:—శ్రీమత్ అనుభవానంద స్వాములవారు. ప్రకాశకులు: అనుభవానందగ్రంథమాల, బాపట్ల, గుంటూరుజిల్లా. వెల రు 2-0-0

ఈ గ్రంథములో సిద్ధాంతమునకు, సాధనకుగల అవినాభావ సంబంధము, సాధనకు సంబంధించిన వివరములు కలవు. శ్రీ స్వాములవారు అనేక వేదాంత విషయముల సులభగ్రాహ్యంగా, సరళమైన భాషలో మాతాజీకి వ్రాసిన ఉత్తరములు సేకరించబడి గ్రంథముగా రూపొందింది.

ఇందులోని 36 ఉత్తరములలో పండితులకూ, పామరులకు కూడా వేదాంత సంబంధమైన విషయాలలో ప్రవేశము, ఆసక్తిగలిగించే అనేకవిషయాలు కలవు. శీఘ్రగతిన ఆధ్యాత్మిక, పారమార్థికచింతను వ్యాప్తి చేయ్యడానికి యీ గ్రంథము విశేషముగానుపకరించగలదు. పైగా సిద్ధాంత, సాధనలు విశేషంగా ప్రజల కందుబాటులోనికి సయితం రాగలవు. ఈ గ్రంథ పఠనానంతరం ఏ వేదాంత గ్రంథమునైనను పఠించి అర్థముచేసికొనుట సులభసాధ్యము కాగలదు.

ఈ గ్రంథముగా రూపొందిన శ్రీస్వాములవారి ఉత్తరములు స్త్రీ మూర్తినుద్దేశించి వ్రాసినవైనను సర్వప్రజానీకానికి ఉపయుక్తమేకాక అమూల్యమైనవనికూడ చెప్పనగును.

బొమ్మరిల్లు:—శ్రీ 'కవిరావు' చిత్రరచన, శ్రీ జి. వి. సుబ్బారావు. ప్రతులు లభించుచోటు : తెలుగుబాల రచయితల సంఘం, బాపట్ల, గుంటూరుజిల్లా. వెల 1-0-0

ఇది బాలలగేయ సంపుటి. చక్కని ముద్రణ. సందర్భోచితమయిన చిత్రములతోటి ఆకర్షణీయముగానున్నది.

పిల్లలకు కథలంటే చాలా యిష్టం. ఆ కథలను గేయాల రూపంగా రచించడముతోబాటు ఉల్లాసమును కలిగించు చిత్రాలనుకూడ పొందుపరచి నీతిబోధకముగానేకాక వినోదవిజ్ఞానముల వెదజల్లారు రచయితలు. రచన బహుసులభమైన శైలికాబట్టి బాలలు అర్థముచేసికొనగలరు.

బాలల సారస్వత విజ్ఞానమునకు దోహదముచేయుచున్న యీ పుస్తకము బహుళంగా ప్రజామోదమును పొందగలదని మా విశ్వాసము.

సుశీల:—శ్రీ తిత్తి జనార్ధనరావు. ప్రతులు లభించుచోటు : స్టూండెంట్సుస్టోర్స, మెయిన్‌రోడ్డు, విశాఖపట్టణం వెల 0-8-0

ఇందులో రెండుకథలున్నవి. మొదటిది లోగడ ఆంధ్రప్రభలో ముద్రితమయినది. రెండుకథలు మనోజ్ఞంగా నడిచినవి. చదువుచున్నంతసేపు పాఠకులను ఉల్లాసపరచునట్టివిగానున్నవి.

చిత్రజగతి:—శ్రీడి. వి. ఎ. ఆచార్య; యస్. సత్యనారాయణాచార్యులు, శివాలయందగ్గర, బాపట్ల, గుంటూరుజిల్లా వెల రు 3-8-0

ఇది తెలుగుభాషాసమితిద్వారా పారితోషికముపొందిన గ్రంథము. ఈ గ్రంథపఠనమువలన చలన చిత్ర రంగానికి సంబంధించిన అనేక విషయాలు విశదముకాగలవు.

ఈ గ్రంథమును రచించుటకుగాను గ్రంథకర్త చేసిన పరిశోధన, కృషి ప్రశంసించతగినవి. ఇందులో కళాకారులకు, నిర్మాతలకు, ప్రేక్షకులకు, దర్శకులకు మార్గదర్శకములుగానుండు అనేక విషయములున్నవి. అంతేకాక చలనచిత్ర పరిశ్రమయెడల, కళయెడల అభిరుచి, ఆసక్తి విశేషంగా చూపుచున్న సామాన్య ప్రజానీకానికి, అభ్యుదయ నటీనటులకు అమూల్యమైన విజ్ఞానాన్ని సయితం యీ గ్రంథపఠనము సమకూరుస్తుంది.

నూతనంగా దర్శకులుగాను, నిర్మాతలుగాను, డిస్ట్రిబ్యూటర్లుగాను చలనచిత్రరంగములో ప్రవేశించువారికీ గ్రంథము విశేషముగానుపకరించగలదనునది నిర్వివాదాంశము. దాంతోపాటు కళాపిపాస, కళారాధనలు సయితం ప్రజలలో వ్యాప్తికి యీ గ్రంథము తోడ్పడగలదు.

## ప్రత్యేక సంచికలు

'ఆంధ్రమహిళ' జన్మదినసంచిక మా కార్యాలయమునకు చేరినది. సర్వాంగ సుందరంగా ఉత్తమ రచయితలు, రచయిత్రుల వ్యాసాలతోటి, చిత్రములతోటి ముచ్చటగా వెలువడినది. ఈ సంచికనుచూచి పురోభివృద్ధిదశలోనున్న 'ఆంధ్రమహిళ', 'ఆంధ్రమహిళాసభ' ఆంధ్రులకు గర్వకారణమయినవిగా చెప్పక తప్పదు.

ఈ సంచిక వెల రు 1-8-0. ప్రతులకు ఆంధ్రమహిళాసభ, 24 ఎ. లజ్ చర్చిరోడ్డు, మద్రాసు 4. కు వ్రాయాలి.

♦ ♦ ♦

'స్వతంత్ర' (ఇంగ్లీషు) వార్షిక సంచిక మా కార్యాలయమునకు చేరినది. శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌదరిగారి ముఖచిత్రము యీ సంచికకు ప్రత్యేక ఆకర్షణలలో నొకటి.

సంపాదకులు శ్రీ ఖాసా సుబ్బారావుగారి ప్రతిభా సామర్థ్యాలకు యీ సంచిక నిదర్శనము. అమూల్యమైన వ్యాసాలతోటి, ప్రత్యేక శీర్షికలతోటి, వర్ణచిత్రాలతోటి పాఠకుల మనస్సులను విశేషముగా రంజింపజేయునట్టిదిగా నున్నది.

విశేషంగా ప్రజాభిమానమును చూరగొన్న 'స్వతంత్ర' దినదిన ప్రవర్థమానమగుచు దేశానికి, ప్రజలకు సేవచేయగలదనుటలో సందేహము లేదు.

సంచిక వెల రు 1-8-0. ప్రతులకు 'స్వతంత్ర' కార్యాలయము, 2 బ్రాడీసురోడ్డు, మద్రాసు 4 కు వ్రాయండి.

సి. సి. పున్నయ్య

# సంపాదకీయములు

## హోమియో వైద్య విధానం

ఇండియన్ యూనియన్ వైస్ ప్రెసిడెంటు డా. రాధాకృష్ణగారు న్యూఢిల్లీలో అఖిలభారత హోమియోపతి మహాసభ తృతీయ వార్షికోత్సవాన్ని ప్రారంభిస్తూ హోమియోపతి మందులు చౌక మాత్రమేకాక వాటిని వాడినందువలన దేహప్రకృతికి హానేమి లేదుకాబట్టి యీ వైద్య విధానమును భారత దేశంలో ప్రోత్సహించాలి అన్నారు.

ఏ వైద్యవిధానమయినను పరిపూర్ణమయిన అనుభవ విజ్ఞానములతో అనారోగ్యానికి గురియయిన ప్రజానీకానికి విశేషంగా మేలుచేయగలదు. హోమియోపతి మందులు చౌకయనేది, నిరపాయకరమయినది వాస్తవమే. కాని ఆ వైద్య విధానమయినా ప్రభుత్వాదరణపొంది ప్రవీణులైన వైద్యులు తయారయిననాడు కాని సామాన్యప్రజానీకానికి మేలుచేకూరదు. అసంపూర్ణమైన విజ్ఞానము, అనుభవములతోకూడిన యితర వైద్య విధానములతోబాటు హోమియోపతినికూడ జతకట్టి హోమియోపతిని ప్రభుత్వము ప్రోత్సహించి ఆదరించడం సముచితము.

## హిందూబాలికల అపహరణ

గతనెల 25, 26 తేదీలలో జరిగిన కేంద్రసంఘ సంక్షేమసంఘంబోర్డు సమావేశమునకు హాజరయి వచ్చిన శ్రీమతి క్లబ్‌వాలాగారు ఇండియా, పాకిస్తాన్ సరిహద్దులలోని బరోడా, అహమదాబాద్ నగరాలలో కొన్ని కేంద్రాలు ఏర్పడి వయసువచ్చిన ఆడపిల్లలను పాకిస్తాన్‌కు అమ్మడం జరుగుతున్నదనియు, ఈ సమస్య చాల తీవ్రపరిస్థితులను తెచ్చిపెట్టగలదని ఆందోళనను వెలిబుచ్చారు. ఇది చాల విచారకరమేకాక తక్షణమే నిరోధించవలసినది. ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధతో ఆ చూకితీసి ఆ పరిస్థితులకు కారణాలను, అట్టి వ్యాపారానికి కారకులను అదుపులోకి తీసికొనివచ్చి నేరస్థులను శిక్షార్హులుగా చేయడం ప్రభుత్వ కర్తవ్యం.

♦ ♦ ♦

## మహిళా పురోభివృద్ధి

మొత్తము 22 దేశాలనుండి 34 మంది మహిళలకు 125000 డాలర్లను అమెరికన్ పోస్టు గ్రాడ్యుయేట్ తరగతులలో చదువడానికి అమెరికను అసోషియేషన్ ఆఫ్ యూనివర్సిటీ విమెన్ వారు మంజూరు చేశారట. అందులో ముగ్గురు భారతీయ మహిళలకు అవకాశము లభించుట హర్షించతగిన విషయము. ఇటి ఉపకార వేతనములు భారతమహిళా ఉద్యమాన్ని, పురోభివృద్ధిని ప్రోత్సహించగలవనుటలో సందేహములేదు.



12228

## శ్రీ విజయనామసం॥ర మార్గశిర - పుష్యమాసములు.

| | | | |
|---|---|---|---|
| 1953 సం॥ డిశంబరు నెల | 16 | బు | ఏ 44-7 అశ్వ 45-5 వరా 8-44 మొ 10-13 వ సర్వేషాం వైకుంఠఏకాదశి |
| | 17 | గు | ద్వా 38-24 భ 41 6 వ ఉ 9-26 మొ 10-56 వ రుక్మాంగద ద్వాదశి |
| | 18 | శు | త్ర 33-25 కృ 37-46 ది 9-26 వప 10-13 మొ 2-31 వ |
| | 19 | శ | చతు 29-15 రో 35-26 ది 16-13 పాషాణచతుర్దశి |
| | 20 | ఆ | ○ పూర్ణిమ 26-12 మృ 34 6 వతె 4-29 మొ 6-5 వ దత్తాత్రేయజయంతి |
| | 21 | సో | బ. పాడ్యమి 24-20 ఆరుద్ర 33-త్యాజ్యాభావః, వర్జ్యంలేదు |
| | 22 | మం | విదియ 23-42 పున 34-59 వప 8-16 మొ 9-54 వ |
| | 23 | బు | తదియ 24-21 పుష్య 37-14 త్యాజ్యాభావః, వర్జ్యంలేదు |
| | 24 | గు | చ 26-13 ఆశ్రే 40-40 వి 58-44 వప 2-32 మొ 4-14 వ |
| | 25 | శు | పం 29-8 మఘ 45-0 వప 11-36 మొ 1-19 వ |
| | 26 | శ | ష 32 51 పూఫ 50-11 వ ఉ 9-13 మొ 10-57 వ |
| | 27 | ఆ | స 37-18 ఉఫ 55-45 పవ 10-27 మొ 12-12 వ |
| | 28 | సో | అ 42-3 హ 60-10 వప 2-4 మొ 3-50 వ |
| | 29 | మం | న 46 54 హ 1-47 వసా 4-2 మొ 5-48 వ |
| | 30 | బు | ద 51-35 చిత్ర 7-45 వప 3-46 మొ 5-31 వ |
| | 31 | గు | ఏ 55-46 స్వా 13-26 వసా 5-58 మొ 7-42 వ 'సర్వేషామేకాదశి |
| 1954 సం॥ జనవరి నెల | 1 | శు | ద్వా 59-16 విశా 18-35 వరా 6-14 మొ 7-57 వ |
| | 2 | శ | త్ర 60-10 అనూ 22-57 వరా 9-37 మొ 11-19 వ |
| | 3 | ఆ | త్ర 2-0 జ్యే 26-22 వరా 1-22 మొ 3-2 వ |
| | 4 | సో | చతు 3-28 మూ 28-39 వసా 4-21 మొ 6-1 వ |
| | 5 | మం | ● అమా 3-40 పూషా 29-44 వరా 2-25 మొ 4-1 వ |
| | | | **పు ష్య మా స ము** |
| | 6 | బు | శుద్ధపాడ్యమి 2-38 ఉషా 57-2 వరా 10-18 మొ 11-52 వ |
| | 7 | గు | తదియ 56 37 శ్ర 28-23 వరా 9-44 మొ 11-16 వ |
| | 8 | శు | చ 52-6 ధ 26-8 వరా 11-48 మొ 1-19 వ |
| | 9 | శ | పం 46-52 శత 22-48 వరా 9-39 మొ 11-9 వ |
| | 10 | ఆ | ష 41-3 పూభా 18-50 వరా 10-59 మొ 12-28 |
| | 11 | సో | స 34-47 ఉభా 14-28 వరా 11 25 మొ 12-54 వ |
| | 12 | మం | అ 28-28 రే 9-49 వతె 4-49 మొ అష్టమీతిథిః |
| | 13 | బు | న 22-25 అశ్వ 5 21 వసా 5-38 మొ 7-7 వ |
| | 14 | గు | ద 16-44 భ 1-11 వరా 6-23 మొ 7-54 వ ఉత్తరాయణపుణ్యకాలం |
| | 15 | శు | ఏ 11-45 రో 55-17 వ ఉ 9-52 మొ 11-24 వ |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd
15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

12228

లోధ్ర

FOR
LADIES'
HEALTH







KESARI KUTEERAM L<sup></sup>

ROYAPETTAH MADRAS

ఆడుజన్మను సార్థకపరచే

ఆరోగ్యప్రదాయిని

Lodhra Press, Madras- 14.